## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. 

**SaiRealAttitudeManagement**(SAI RAM) **- సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేదయాగజ్యోతి



సి.వి.సిద్ధయ్యమూర్తి.

# వే ద యా గ భూ మి

—— (౦) ——



సి. వి. సిద్ధయ్యమూర్తి

---

(This Book is Published by the financial assistance of
Tirumala Tirupati Devastanam under their Scheme
"Aid to Publish Religious Books")

# వేదయాగ భూమి

రచన : సి వి. సిద్దయ్యమూర్తి
ప్రథమ ముద్రణ : 1996
1000 కాపీలు

కవరు పేజి
శ్రీ టి. దశరథరామిరెడ్డి
అజంతా ఆర్ట్సు, 212 తిలక్ రోడ్డు
తిరుపతి.
వాండీ ఆర్ట్సు. చిత్తూరు.



ప్రచురణ :
శ్రీ గజలక్ష్మి ప్రింటర్స్
వేలూరు రోడ్డు – గిరింపేట, చిత్తూరు.

సి. వి. సిద్దయ్యమూర్తి
శాంతి నిలయం
తిరుపతి.

# తొలి పలుకులు



ఈ పుస్తకం ప్రచురించడంలో నా పాత్ర నిమిత్తమాత్రమైనది నేను సామాన్యమైన వ్యక్తిని ఆడంబరాలు మనిషినీ తాత్కాలికంగా అందల మెక్కిస్తాయి హర్షించే విధంగా చేస్తాయి. అలాగే కూడ అనుభవాలు సహి చూచాను. చదువులో కొంతవరకే జ్ఞానాన్ని పొందాను, అజ్ఞానాన్ని అందరికి పంచాలనే ఆశ వుంటుంది. అదే నేను చేసిన పని. చిన్ననాటి నుండి అలవడిన అలవాటే నేటి వరకు వీడలేదు. నేను పొందిన జ్ఞానాన్ని ఒక రూపంలో నలుగురికి జ్ఞానమార్గం చూపాలని చేసే ప్రయత్నంలో వేదాలకు యాగాలకు నిలయమైన యీ భూమిలో నాటి పురాణాల కాలం నుండి నేటి వరకు జరుగుతున్న పరిణామాలను క్లుప్తంగా ప్రచురించడానికి పూనుకొన్నాను ఆర్థిక పరిస్థితులు బాగుండాలి స్వయంగా ప్రచురించాలి. అయితే అస్తోమత లేదు కానీ ఎందరో వేదాంత పుస్తకాల ప్రచురణకు ఆర్థిక సహాయాలు అందజేసేవారు నాటికాలం. ఈ కాలానికి ఆలాంటి త్యాగగుణాలు మరుగై పోతున్నాయి.

ఈ కారణంగా మంచిమంచి పుస్తకాలు పాతంజల యోగశాస్త్రం వంటి గొప్ప వేదాలతో సామాన్యునికి అర్థమయ్యే విధంగా వున్న పుస్తకాలు నేడు కానరాకుండా వున్నాయి అయితే నేటి కాలపరిస్థితులకు తగినట్లుగా స్వామి వివేకానందులు ధ్వనించి ప్రపంచ వ్యాప్తంగా వేదాంత రహస్యాలను వెద జల్లిన కారణంగా సామాన్య జనంసైతం కొంతానికికొంతవరకు వేదవాఙ్మయా నికి వున్న గొప్పతనం యీ నాటికీ శాశ్వతంగా నిలబడివుంది. వేదాలకు యాగాలకు నిలయమైన పవిత్ర దివ్య క్షేత్రాలు గలిగిన భారతభూమిని, జన్మనిచ్చిన జిల్లా ప్రాంతాన్ని దృష్టిలోపెట్టుకొని ఈ జిల్లా ప్రాంతంలో వెలి సిన ఆలయాలు ప్రాచీనాలయాలు-నాటి చరిత్రలు-చరిత్రకారులు-పూజలు-పద్ధతులు-విదానాలను కొద్ది వరకు సేకరించి ప్రచురించడం జరిగింది.

మానవ సంస్కృతిని మార్చివేసినవి వేదాలు-ఆదినాటినుండి వస్తున్నవి నేడు మానవజాతికి ఆదర్శంగా మార్గదర్శకములుగా మిగిలిపోయి వున్నాయి. వేదవాఙ్మయ విషయాలను సేకరించుటలో ప్రముఖ విద్యావేత్త ఆధ్యాత్మిక

రంగంలో అనుభవం వున్న పూజ్యులు డా॥ సంగమేశంగారి తోడ్పాటు తీసు కొన్నాను అట్లే కొంతమంది సలహాలు కూడా యిందులో పొందుపరచడం జరిగింది వీటిని ఒక రూపంలోకి తెచ్చి సమాజానికి అందించిన యిందలి విషయాలు కొందరికైనా వుపయోగపడగలవనే ఆశతో యీ ప్రచురణను శ్రీకారంచుట్టి యీ వేదభూమివాసులు శ్రీనివాసుని పూజలకై తపించే కార్య భారం మోస్తున్న అధికారులు, వేదాంత ప్రచారానికి ఆర్థిక సహాయాలు అందజేయడంవలన వారిని అర్థించి వారి ఆర్థిక సహాయాన్ని కోరగా-నా కోరిక మన్నించి కొంతవరకు ఆర్థిక సహాయాన్ని అందజేశారు దీనితో నా ఆశ నేనార్జించిన కొంతజ్ఞానాన్ని పదిమందికి పంచాలనే కోరిక ఆ శ్రీనివాసుడే తీర్చాడనే విశ్వాసంతో - కృతజ్ఞతగా యీ పుస్తక ప్రచురణ అనారోగ్య కారణంగా అలస్యంగా నైనాపూర్తి చేయగలశక్తి ప్రసాదించినందులకు కృత జ్ఞతలు తెలుపుతున్నాను.

లోకాలు ఎన్నోకాని ఈ లోకంలోవున్న వైకుంఠనిలయ ప్రాంతం మాత్రం విశ్వాకళ్యాణానికి విశ్వశాంతి కొరకు ఎందరో మరెందరో పుణ్యా త్ములు, అధ్యాత్మికతత్త్వవేత్తలు యీ వేదభూమిలో ఉద్భవించి వేదాంత సారాలను వెదజల్లుతు విశ్వవ్యాప్తంగా శాంతిబీజాలను నాటుతూవచ్చారు. మానవకళ్యానానికి యజ్ఞాయాగాలు నిర్వహిస్తు మానవహృదయాలను పవిత్రం చేస్తున్న తిరుమల-తిరుపతి కార్యక్రమాలు కొంతవరకు క్లుప్తంగా యీ చిన్న పుస్తకంలో తీసుకొనిరావడం జరిగింది.

ఈ పుస్తకం సామాన్యులకు అందుబాటులో వుండాలని ఆశిస్తూ యీ నా ప్రయత్నం సఫలీకృతం కావడానికి తోడ్పడిన వారికి నా కృతజ్ఞత తెలియ జేసున్నాను.

మీ,

**సి. వి. సిద్దయ్యశాస్త్రి**

వెలకటూరి చంద్రశేఖరనాయుడు
యం.ఎ (ఇంగ్లీషు) యం.ఎ. (సోషియాలజి)
పి జి. (డిప్లమ) ఇన్ పి ఆర్., ఐ ఆర్. పి. యం.

తిరుపతి
23—5—96

# వేదబాగ్యం

భారతదేశం వేదభూమి తపోభూమి కూడా. మన భారతీయుల పుణ్య ఫలముగా చతుర్వేదములు ఉద్భవించినవి. ఈ వేదములు మన సనాతన ధర్మమునకు ఎడతెగని గంగా ప్రవంతి వంటి మన వారసత్వ సంపదకు ఆధారభూతములై ఉన్నవి. వేదములు జ్ఞాన, విజ్ఞాన నిధులు. అందుకనే ఓ రాక్షసుడు వీటిని దొంగిలిస్తే, శ్రీ మహావిష్ణువు మత్స్యావతార మెత్తి వేదములను కాపాడాడు. వేదాల విలువలు గుర్తించినందువల్లనే జర్మనీ దేశమునకు మేధావులు శ్రీ లూయీస్‌ఫిషర్ మాక్సుముల్లర్ మన భారతదేశ వేదములను పఠించి, మన భారతసంస్కృతిని, సాంప్రదాయాన్ని స్తుతించాడు మన తొలిప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు నుడివినట్లు, మన భారతదేశమును గురించి తెలిసికొనవలెనన్న, మనం మొట్టమొదట వేద సారాంశము, రామాయణ, మహాభారతాల్ని గురించి తెలిసికోవాలి. అటు వంటి వేదభూమిలో జన్మించిన మనం ఎంత ధన్యజీవులమోగదా. కానీ మనం గత వైభవాన్ని నెమరవేసుకొంటున్నామే కానీ ఆచరణలో మాత్రం చిత్తశుద్ధి పాటించడం లేదు. వేదకాలంలో జాతిమతములు లేవు. వేదాల్లోకూడ యిటు వంటి వర్ణవివక్షలు కనబడవు. మరి ప్రస్తుత సమాజంలో జాత్యహంకారం, జాత్యభిమానం అంటు రోగాల్లా వ్యాపించాయి. మన పూర్వీకులు మనకు పరంపరగా అందించిన ఈ జ్ఞానసముద్రతీరంలో కనీసం కొన్ని గవ్వలమిడి మిడిజ్ఞానం ఏరుకొన్నట్లైతే మనం నిజంగా ఈ వేదభూమి పుత్రులమే

మన భారతదేశం యాగభూమికూడా. యోగము ప్రాప్తించుటకై పూర్వకాలం యాగం చేసెడివారు యాగము ప్రస్తుత సమాజమునకు అను సరణీయం కాకపోయినను, మన పూర్వీకులు దీనిని నిత్య జీవితంలో ఒక అంతర్భాగంగా ఆచరించుచుండిరి

'వేదయాగభూమి' అనే ఈ చిరుపొత్తమును రచించిన శ్రీ సి వి సిద్దయ్యమూర్తిగారు బహుధా అభినందనీయులు. సనాతన ధర్మముపై మాతృభూమిపై సదాచారములపై వీరికిగల భక్తి ప్రపత్తులు వెల్లడింపగును మన దేశ 'వారసత్వ సంపద'ను గూర్చి తెలియని మన పాఠకులకు ఈపుస్తకం ఉపయోగపడును.

ఇటువంటి దేశభక్తి, జాతీయ దృక్పథం, సర్వమానవ సర్వమత సమభావాలుగల శ్రీ సి. వి. సిద్ధయ్యమూర్తిగారి కలం నుండి మరెన్నో మంచి రచనలు రావాలని ఆకాంక్షిస్తూ.

వి. చంద్రశేఖరనాయుడు
ప్రధాన కార్యదర్శి,
టి.టి.డి కార్మిక ఉద్యోగ సంఘాల సమాఖ్య.

# నివేదన

రచయిత వేదవనంలో విహరిస్తూ వేదపుష్పాలను ఏరి, చేర్చి, కూర్చి సమాజ భక్తులకు హారంగా పొందుపరచడం చూస్తే, వేదవిత్తులు జల్లినదొక రైతే వాటిని నాటిపెంచి పోషించినది మరొకరైతే, ఫలాలు పంచినది మరొకరు, వారిలో యీ పుస్తక రచయిత కావడము ముదావహం.

వేదాలున్నచోట ఆలయాలు, దేవాలయాలు అనే పవిత్ర ఆలయాలు, భక్తి నివాసనిలయాలు, యీ వేదభూమిలో వెలసిన ప్రాచీనాలయాల వివరాలు, వాటి ప్రాముఖ్యతను, స్థలాలను సేకరించి ప్రచురించడం విశేషం.

రచయిత ఆవేదన అంతర్యం పరిశీలిస్తే వేదాలు జ్ఞాన, విజ్ఞాన జ్యోతులనితలంచి, ఈ జ్యోతుల వెలుగులలో మానవుడు సుఖప్రయాణం చేయాలనే ఆకాంక్ష అర్థం అవుతున్నది ఇందులోని విషయాలు నిస్సంకోశంగా వెల్లడించినట్లు కనబడుచున్నది

ఆధ్యాత్మిక వేదమార్గంలో రచయిత అనుభవాలు ఆధ్యాత్మికతత్వవేత్తల అమూల్య సారాంశాలు గ్రహించారు, తానుతరించి యితరులను తరింపచేసే ఆశయంతోనే యీ వేదయోగభూమి పుస్తకం తన కలం కదలికలతో మెలకువతో మానవుని మోక్షమార్గానికి కొంతవరకు చైతన్యం కల్గించారు.

బహుశా రచయిత తన చిన్ననాటి నుండి పొందిన అనుభవాన్ని ఈ రూపంలో జ్ఞానప్రసాదాన్ని పంచడానికి పూనుకొని చక్కని విన్నపాన్ని వెలువరించి వెలుగుకు మార్గం చూపడం తన జీవితందన్యం చెందిందని అనక తప్పదు, ఓం శాంతిః శాంతిః శాంతిః

సత్యాన్వేషి —

# స మ ర్ప ణ

జన్మనిచ్చిన నా వేదభూమిలో నా ఆవేదన తులసివనంలో గంజాయి మొలకలు, వివేకవంతులులేని విద్యావిజ్ఞాన నిలయాలు, భక్తిలేని గుడిలో మమతలులేని మతాలు, మానవ కల్యాణానికి ఏనాటికైనా, వేదవేద్యులకైనా కృతజ్ఞతలేని కృతఘ్నులకు నిలయాలై మానవ వినాశానికి మార్గాలు చూపుతున్నాయి అట్టి భూమి కారాదు నా వేదభూమి, ఈ ఆలయాలు వెలసిన భూమి నిరోధకులకు నిలయం కారాదు.

ప్రపంచానికి శాంతి వెలుగు చూపినది నా వేదభూమి. భారతావని అధ్యాత్మిక, విజ్ఞాన విలువలు విత్తనాలు వెద జల్లిన నా వేదభూమి. భూమిలో ఫలించిన ఫలితాల పలాల రుచులే యీ వేదాలు. వేదాలు ఒకరి సొమ్ము కాదు, అది అందరికీ అర్థమై పంచబడినపుడే నా పుణ్యభూమి అందరి వేదభూమిగా వేలకువేలు పండ్లుగా వెలసిల్లుతూవుంటుంది

మానవ మనుగడకు తాత్కాలిక ఆవేశం తోడైన కొంతకాలం అహం భావం ఆవరించి తాను అనే అహంకారంతో కొంతకాలానికి అంతరించి పోనున్నది. ఏది శాశ్వతంకాదు అంతా క్షమలతో కూడుకొన్నదే! ఈ జీవిత సార్థకానికి స్వార్థం అంతానికి ఆరంభంమే అవుతుంది,

ధర్మాన్ని రక్షించు. అది కాపాడుతుందనేది సత్యం ఎదుటివాడిని మోసంచేయడం అనేది తనను తాను మోసంచేసుకోవడమే (కర్మ రహస్యం) ఈ రహస్యాన్ని ఛేదించుకొని బయటపడినవాడే ధన్యుడు. అట్టివానికి ఎల్ల వేళల ఈ భూమినిచ్చే విశ్రాంతి – ప్రశాంతి పరిగెత్తి చూపిన శాంతియే ఎదురై తోడుగా నిలుస్తున్నదనే నగ్నసత్యం విస్మరించరాదు.

సోమరితనరి – నిరుత్సాహం – నిస్పృహలతో నిత్యం బాధపడే వానికి అదృష్టం దురదృష్టంగా వుంటుంది. అదృష్టం కృషితో అనుకోని విధంగా జరిగేదితప్ప - అనుకున్నప్పుడు కృషితో సాధించినదే అదృష్టం. ఇది పండించిన పంటలలోనే వేదభూమి సమృద్ధిని సాధించుతుంది సర్వ మానవ కల్యాణానికి సానుకూలించి సంక్షేమార్గం చూపుతుంది.

నా కృషి ఫలించింది. నా వేదభూమిని వరించి తరించాను. మిగిలింది విశ్రాంతి. ఎదురుచూస్తున్నాను. నన్ను చెడుకోరినవారు క్షేమంగా వుండాలనే కాంక్షిస్తున్నాను నా మంచి కాంక్షించినవారు పరులపట్ల కూడ అదే భావంతో మసలాలని మనసార కోరు తాను

నాకు తోడులేదని ఒంటరివాడైనానని బాధలేదు నా వెంటవచ్చే మంచిమార్గంలో ఎంతమంది పయనించి సుఖాన్ని పొందుతారనేది చూడలేక పోతున్నాననేది మరిచిపోకుండావుంటే నా దేహానికి వేదభూమికి నేను భారం కాలేదని భావిస్తాను.

ఈ భూమిలో పుట్టినపుడు ఏమీ తేలేదు. పెరిగినపుడు ఏది పొందలేదు పొందినది పోయేటపుడు వెంట ఏదీ రాదని ముందు నన్ను నేను తెలుసుకొన్నాను. అంతా అశాశ్వతాలే. అది తెలిసి ఒంటరి జీవితంలో ఎందరో చేయూతనిచ్చారు పరుల క్షేమానికి చేసిన నా కృషికి తోడైనారు అందులో నేను నిమిత్తమాత్రుడుగా నిలిచిపోవాలనే కోరుకున్నాను.

ఈ వేదభూమిలో మానవ కల్యాణానికి జరిగే యజ్ఞయాగాలు శాంతి కోసంతప్ప వేరుకాదు. ఈ శాంతి సుస్థిరంగా నా వేదభూమిలో నిలచిపోవాలనిఅట్టి శాంతిస్థాపనకు సర్వమానవ సౌభాగ్యానికి ఆ దేవదేవుడు అన్నిచోట్ల వెలసి-నిలచి కొలువైనాడు. భక్తకోటికి భుక్తి భక్తి మార్గాలుచూపి మోక్షమార్గంలో నడిపిస్తూ తాను తరించి అందరినీ తరింపచేస్తున్నాడు. అట్టి భగవానుడు వేదవేద్యుడు ఆ శ్రీమన్నారాయణునికి భక్త్యాంజలిలో వేదభూమి రచనలు లోకశాంతికి ప్రసాదించమని ప్రార్థిస్తాను.

కృతజ్ఞతాంజలితో

సి. వి. సిద్ధయ్యమూర్తి

# వేద భూమి

అనంత విశ్వములో మన సూర్య కుటుంబం అతి చిన్నది. సూర్య కుటుంబంలో భూ గ్రహం ఒకటి. శూన్యంలో ప్రేలాడుతూ పరస్పరం ఆకర్షణకు లోనై గ్రహాలు పరిభ్రమిస్తున్నాయి. అనంత శక్తి వాటిని నడుపుతుంది. ఊహాతీతమైన అమితమైన శక్తి విశ్వమంతా వ్యాపించి వుంది. ఒక్క భూగోళములోనే కోట్లాది రకాల జీవ రాసులు. వివిధ రీతులు, భూచరులు, వాయుచరులు, జలచరులు. వీటి అన్నిటికీ జీవనాధారమైన ఆహారం సృష్టిలో లభ్యం. ఈ సృష్టి విచిత్రం. లోతుగా ఆలోచించుకుంటూ పోతే అంతా అగమ్యం. ఏదో విచిత్ర గమ్య అమిత శక్తి జీవ రాశి ఉనికిని హేతువుగా వున్నదని తేటతెల్లమౌతుంది.

ఆ శక్తి ఏమి ? మానవుని ఉనికి ఏమి ? పుట్టుకకు హేతువేమి ? మన కర్తవ్యమేమి ? పని ఏమి ? అదే ప్రశ్నలు సామాన్యునికి కలుగ మానవు ఐహిక ప్రపంచంలో జీవించే జీవికి గు ప్రశ్నలు ఉదయించిన కొంచెంసేపు ఆలోచించి మేధస్సు ఎదగక విడచి పెడుతాడు. కానీ వేదాంతులు కారణజన్ములై ప్రశ్నలకు సమాధానం కనుగొనుటానికి తమ జీవిత కాలాన్ని వెచ్చిస్తారు. సృష్టి రహస్యాన్ని కనుగొని సిద్ధి పొంది ఆ వెలుగుని సామాన్యునికీ అందజేస్తారు.

భౌతిక ప్రపంచంలో ఎంత మసలినా ఎంత అహంకారముతో తిరిగినా తన సామర్థ్యాన్ని ఎంతగా అంచనా వేసుకొన్నా కనక, వస్తు, వాహనాలు ఎంతగా సంపాదించుకొన్నా, ఆఖరి క్షణాలలోనైనా మానవుడు దేవుని శరణు వేడుకొనక మానడు. దేవుని ఉనికిని తెలుసుకోక పోడు.

మానవ జన్మ సుఖ దుఃఖ పూరితము. డబ్బుతో పోయే దుఃఖమైతే బంధువులు, స్నేహితులు తీర్చగలుగుతారు. బంధు వియోగం, మరణాది దుఃఖాలను తీర్చగల వారెవ్వరు ? మనకన్నా శక్తిమంతుడని నమ్మి మన భౌతిక దుఃఖాలను ఏలాగైతే తీర్చుకొనెంచుతామో మానవాతీత దుఃఖాలను తీర్చుకోవడానికి భగవంతుని నమ్మకతప్పదు. ఈ సత్య

వాక్యాలను ఈ వేద భూమిపై వెదజల్లిన వేదాంతులు మనకు వెలుగు జ్యోతులుగా మిగిలిరి.

ఎందరో మహాత్ములు యీ వేద భూమిలో భగవంతునిపై సర్వం ఉంచి ఆ మహా తేజస్సులో లీనమై జగానికి వెలుగును ప్రసాదించింది. కొందరైతే, భగవంతుని ఉనికిని తనలోనే ఉన్నాదని గ్రహించి తనే భగవత్ రూపముని ఎంచి జ్ఞాన సముపార్జన చేసినవారు మరికొందరు. ఎవరు ఏది చెప్పినా ఏది చేసినా లోక కళ్యాణానికి చేశారే తప్ప తుచ్ఛమైన స్వలాభాపేక్షతో కాదు. ఆత్మానందం కోసం కాదు. మహాత్ముల జీవన సరళి ప్రభోదనలసారం మనం గ్రహిస్తే వారు లోకం కోసం, జీవ కోటికి ఎంత త్యాగం చేశారో అవగతమవుతుంది.

ఆది శంకరుల వారినుండి కంచి కామకోటి పీఠ శంకరజయేంద్ర సరస్వతి వరకు ఈ భూమిలో ఉద్భవించి వేదాంత ధోరణులు ప్రజలకు చెప్పి ఆ విజ్ఞాన వెలుగులో హిందూ ధర్మాన్ని లోక కళ్యాణానికి సుసంపన్నం చేశారు. హిందూ మతం కేవలం మతం కాదని జీవన సరళి అని, సర్వ దుఃఖాలను ఈ జీవన విధానం హరించే అగ్ని అని మహాత్ములు చాటారు. సర్వ మత సారం ఒక్కటేనన్న మహోన్నత దృష్టితో ఈ మహానుభావులంతా శ్రమించారు, బోధించారు.

నేడు కలియుగంలో అణు యుగం అవతరించింది. విజ్ఞానంపై ప ప్రపంచం పయనిస్తుంది. ఎలక్ట్రానిక్ యుగంలా మారిపోతుంది. అణు శక్తితో అమూల్యమైన పనులు మానవుడు చేపడుతున్నాడు ఈ శక్తి అటు ప్రగతికి ఉపయోగించవచ్చు. అణు శక్తిని సొంతం చేసుకొన్న దేశాలు తమ తమ దేశాలను సుసంపన్నం చేసుకోవడమేగాక ఇతర దేశాలను తమ గుప్పిట బంధించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఒకరినొకరు నాశనం చేసుకోడానికి సంసిద్ధం అవుతూ బెదరించుకుంటున్నాయి ఇది పరమ నీచమైన ఆలోచన. ప్రమాదకరమైనదేగాక ప్రశాంత వాతావరణానికి విఘ్నం కల్గించేదిగా వుంటున్నది.

అయితే సత్య శక్తిని, అంతర్యామి సృష్టిని నాశనం చేయగల శక్తి మానవుడికి ఎక్కడిది? ఒక్క అణువులో అనంత శక్తి దాగివుందని

తెలుసుకొన్న మానవుడు అసంఖ్యాక అణు సముదాయమైన ఈ సృష్టిలో ఎంత శక్తి దాగి వుందో గ్రహించలేక విఱ్ఱవీగుతున్నాడు. సృష్టిలో అనంత శక్తిని ఇంకా అంచనా వేయలేక తను ఒక శక్తివంతుడనని, సాధించాలని అహోహ పడుతున్నాడు తాను తీసుకొన్న గోతిలో తానే పడే ప్రయత్నాలు చేస్తున్నాడు. ఈ ప్రపంచములోని అణువులన్నిటికి రుణ, ధన ధృవాలు వుంటాయి మనలోని అణువులకు ఆ రెండుధృవాలు వుంటాయి. మనలోని రుణ ధృవాలు ఇతర పదార్ధాలలోని ధన ధృవాలను ఎంతో కొంత ఆకర్షిస్తాయి. అలాగే ధన ధృవాలు ఇతర పదార్ధాలలోని రుణ ధృవాలను ఎంతో కొంత ఆకర్షిస్తాయి అలాగే ధన ధృవాలు ఇతర పదార్ధాలలోని రుణ ధృవాలను ఆకర్షిస్తాయి. ఈ ఆకర్షణా శక్తి అనంతంగా సాగుతూనే వుంటుంది దానినుండే మహత్తరమైన మహోన్నతమైన శక్తి ఉత్పన్నమవుతుంది. ఆ శక్తితోనే యావత్తు ప్రపంచం కదలుతుంది.

ఈ సూక్ష్మ సత్య విషయాన్ని గ్రహించిన మహాత్ములు తమలోని శక్తిని ఇనుమడింప చేసుకోవడానికి "సాధన" చేయాలని తెలుసుకొన్నారు. వజ్రాన్ని మొఠిసేలా చేయాలంటే వలు మార్లు అలాపన చేయాలి "సాధన"తో సాధించలేనిది ఏది లేదని మహాత్ములు గ్రహించారు దానికి అనంత శక్తిమంతుడైన పరమాత్ముని కేంద్రంగా చేసుకొని తమ శక్తినంత ఆ కేంద్రం చుట్టూ పరిభ్రమింప చేశారు. అనంత శక్తిమంతుడైన పరమాత్ముడు ఎవరో కాదు. అనంతంగా వ్యాపించియున్న ఈ విశ్వములోని అణు సముదాయం. ఏక దృష్టితో ఈ అణు సముదాయాన్నంతా చూడాలంటే ఒక ముద్ద చేసి చూపిన సౌలభ్యంగా వుంటుందని ఎంచి, ఏకాగ్రత మనావు అవుతుందని తలచి ఆది ఋషులు ఈ అనంత సముదాయానికి ఒక రూపం కల్పించి పరమాత్ముడు అన్నారు. యీ భూమిలో ప్రతిష్ఠించారు, పైగా ఆ పరమాత్ముడు నిర్గుణుడు, నిరూపుడు అని వ్యాఖ్యానించారు. ఆది ఋషుల మేధా సంపత్తి మనకు ఇక్కడ బోధ పడుతుంది.

ఇంతకు అణువులకు రూపమేది ? గుణమేది ? అణువు అసలు మన కంటికి కనపించదే. అందుచేత ఈ అనంత అణు సముదాయానికి

ఇచ్చిన రూపానికి నిర్గుణ రూపి. నిరూపి అని మహాత్ములు చెప్పారు. అటువంటి అనంత శక్తిమంతుడైన పరమాత్మునిని కేంద్రముగా తీసుకొని, "తన"లోని అణువులను ఆ కేంద్రం చుట్టూ పరిభ్రమింపజేసి ఋణ ధన ధృవ ఆకర్షణ వికర్షణలకు గురి అయి విపరీత చక్రమునుగాని శక్తిని పొందగలిగారు. గొప్ప "మేధస్సు"ను. "మనస్సు"ను. "బుద్ధి"ని సంపాదించగలిగారు. వీటివలన గొప్ప "దృష్టి" సంక్రమించింది. ఈ దృష్టితో భవిష్యత్తును సందర్శించగలిగారు. "సర్వే జనా సుఖినోభవంతు" అనే సత్యాన్ని చాటారు. ప్రేమ, కరుణ, ఇత్యాది అద్వైత విషయాలను తమలో ఇముడ్చుకొని సామాన్యులను ఉద్ధరింపజేసి అరాచకాలనుండి దూరంగా ఉండేటట్లు చేశారు. కామ ఈర్ష్య, ద్వేషాలకు అతీతంగా వుండి ఐహిక వాంఛలకు లోనుకాక శక్తిమంతులై సర్వ ప్రపంచాన్ని ఆకర్షించారు.

"సాధన" చేసి సంపాదించిన మేధస్సుతో మహామహులు కొత్త సూత్రాలను కనుగొన్నారు. జీవన విధానాలను విడమరచి చెప్పారు. వేద ధర్మాన్ని మెరుగులు దిద్ది మానవ జీవనానికి ఆలంబన చేశారు. లోక కళ్యాణానికి సర్వజన క్షేమానికి వేద ధర్మాలను క్రొత్త క్రొత్త రీతులలో వ్యాఖ్యానించి అతి సామాన్యులు సైతం ఆచరించి అనుసరించే విధంగా మలచారు. మార్గం చూపారు. మహాత్ములు సువతు శాంతి, సత్య ధర్మంకన్న మరో ఆయుధము అవినీతి, అకృత్యాలను పారద్రోల గలిగేది ఏదీ లేదని ఎలుగెత్తి చాటారు. వస్తు ప్రపంచంలో జీవించే మానవుడి దగ్గరనుంచి సర్వోత్కృష్టమైన మాధవుడువరకు ఎలా తన "విధిని" లోక కళ్యాణార్థమై నిర్వర్తించుటలో వరించి వితరించారు - తరింప చేశారు, ఆదే సత్య ధర్మంగా చాటి వెలుగు జ్యోతులు వెలిగించారు. ఆ జ్యోతుల ప్రకాశమే మన జీవిత వెలుగులైనవి.



# యాగాలకు నిలయం వైకుంఠం

విశ్వ శాంతికి, ఎందరో యుగ పురుషులు ఎన్నెన్నో యాగాలు చేస్తూ, లోకకళ్యాణానికి సుభిక్షాన్ని కల్గించడం వింటున్నాము. అప్పుడు కళ్లారా చూస్తున్నాము. ఆ చూచే భాగ్యం విశ్వ మానవ కోటికి వేద భూమి వైకుంఠ నిలయంలోనే దొరకడం మానవ జీవితం ధన్యత చెందిందనే చెప్పవచ్చును

గతంలో ఒకసారి మొన్న మరోసారి మానవ కళ్యాణానికి విశ్వ శాంతి సహస్ర కుండాత్మక శ్రీ మహావిష్ణువు యాగం తిరుమల వైకుంఠ నిలయంలో జరగడం చారిత్రాత్మకమైనది.

ఈ యాగ ఫలితం సర్వజన సంక్షేమానికి పంటలు పండుతాయి. వర్షాలు వస్తాయి. కలుషితమైన వాతావరణం పరిశుద్ధమై, ప్రజలందరూ పవిత్రాత్ములై సుఖ సంతోషాలతో, ప్రశాంతతతో తమ జీవన సాగరాన్ని ఈదగలరనే (సాగించగలరని) సత్యాన్ని చాటి చెబుతుంది.

ఈ వేద భూమి కేంద్రం, సాక్షాత్తు అవతార పురుషుడు కలియుగ మయిన శ్రీ వెంకటేశ్వరునికి నివాస స్థానమై, సుందర మనోహరమైన జలధారలు ప్రవహించు శ్రీ వెంకటాచలమై వెలసినాడని పురాణాలు చెబుతున్నాయి. ఈ యొక్క పర్వత సౌందర్యానికి ముగ్ధుడయ్యే శ్రీనివాసుడు యీ భూమిని తన నిత్య వైకుంఠముగా ఎంచుకొన్నాడు. నిలుచుకొన్నాడు. ఈ పవిత్ర క్షేత్రంలో నుంటూ లోకాన్నిటిని ఆలించి పాలిస్తూ ప్రజలు కోరిన కోరికలు పలువిధాల తీరుస్తూ, ఓదారుస్తూ, ప్రేమని భక్తులకు ప్రశాంత వాతావరణాన్ని ప్రసాదిస్తున్నాడు.

ఈ వేద భూమిలో ఎందరో మహానుభావులు లోక కళ్యాణానికి తమ వేద ఘోషలు వినిపిస్తూ సత్ప్రవర్తన సత్ మార్గంలో నడిపించడానికి చేస్తున్న ప్రబోధనలు కూడా యజ్ఞ యాగాలు రూపంలో - ధర్మ ప్రచార మార్గంలో - మరెన్నో జ్ఞాన సభలు - సదస్సులు నిర్వహించడం వైకుంఠ నిలయం చూపుతున్న మార్గం మారువరానిది.

ఆ నాటి ఆది శంకరుల అడుగు నేడు
జ్ఞాన పీఠమైంది. వేద ఘోషలతో
ప్రజ్వరిల్లుతున్నది. దిన నిత్యం జన
దైనందిన జీవిత వెలుగు బాటకు
దారి చూపుతున్నది వేద భూమి.

మనుజుడు చేయు తపస్సు.
యజ్ఞము, తాను చేయు పుణ్యము
వలననే కలుగును. కానీ పుణ్యంమంతా
మానవుని క్షణమైన కోపాగ్నికి అంతా
ఆహుతి అయిపోతున్నది. అందుకే
కోపాన్ని త్యజించాలి.

ఏ మహనీయులు తనయందు కల్గిన
కోపమును, తమ బుద్ధిచే ప్రజల్వించు అగ్నిని
జలమనే కరుణచే చల్లార్చునట్లు
శమింప చేసుకుందురో వారే యీ
ప్రపంచమున ధన్యులు కాగలరు.

మానవ స్వభావానికి భగవంతుడి సర్వశక్తిత్వానికి, దివ్య వైభవానికి దేనికైనా ఎదురు తిరగవచ్చునేమోగానీ సత్యాహింసలకు మాత్రం కాదు. అటువంటి చైతన్యవంతమైన వేద సిద్ధాంతాన్ని ప్రభావితం చేశారు మహాత్ములు. అట్టి మహాత్ముల వేద విజ్ఞానాలే నేడు విరబూస్తున్న వెలుగు జ్యోతులు. మానవాళి అజ్ఞానాన్ని పారదోలి వెలుగు ప్రవాహాన్ని ప్రవహింప జేస్తున్నారు.

ఈ దృష్టితో మనం ఆలోచించినపుడు యీ వేద భూమిలో వేద వాఙ్మయమును గురించి కూడా తెలుసుకొనుట ఎంతైనా అవసరం.

# వేద వాఙ్మయము

ప్రపంచములో మిక్కిలి ప్రాచీనమైన సాహిత్యము వైదిక సాహిత్యము. మానవ జాతి చరిత్ర కిది మొదటి పాఠ్య గ్రంథము. మానవుని సర్వతోముఖాభివృద్ధికి మూలమైన తత్త్వము లిందెన్నో ఉపదేశింపబడినవి. భారతీయ సభ్యతా సంస్కృతుల కిది పునాదిరాయి. భారతీయ ధర్మ జిజ్ఞాస కిది తరుగని ఖని. భారతీయ జీవన విధానమున కిది ఆదర్శము. భారతీయ భాషా సాహిత్యముల కిది వెలలేని మాతృక.

హిందువులకు వేదము పరమ ప్రమాణము అది దైవ తుల్యము' దృష్టాదృష్టములైన అభీష్ట ఫలము అందుకొనుటకు అనిష్ట ఫలము అడ్డగించుటకు వేదమే పరమోపాయము ప్రత్యక్షముగా చూచిగాని, అనుమానముచే నూహించిగాని గ్రహింపరాని విషయములు వేద విజ్ఞానము వలననే గ్రహింపనగును లౌకిక వస్తు పరిజ్ఞానమునకు వేదచక్షువు సహాయకారి. ఋషులు చక్షువులు.

పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనమ్ ।
అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్ర మితి స్థితిః ॥

(మను. 13-94)

పితరులకు దేవతలకు మానవులకు వేదమే చిరంతనమైన నేత్రము అందువలన అది తిరుగులేని శాస్త్రము. 'తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' అని చెప్పిన గీతావాక్యము ననుసరించి కార్యాకార్య విచక్షణకు వలసిన ప్రమాణము వేదప్రమాణమనియే తాత్పర్యము. సాక్షాత్కృతధర్ములైన ప్రాచీన మహర్షులు స్వానుభవ పూర్వకముగా దర్శించి, శిష్య పారంపర్యముగా లోకమున కందజేసిన మహత్తర విజ్ఞాన మగుటచేత వేలాది సంవత్సరములుగా వేదము హిందువులకు పరమవిశ్వసనీయమైన ప్రమాణము హిందువులు ఈశ్వర విరోధమైనను సహింతురుగాని వేదవిరోధ మంగీకరింపరు వేద ప్రామాణ్యబుద్ధియే హిందుత్వమునకు ప్రధాన లక్షణము. వేదాధ్యయన మొక విధి. "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ" అని

పతంజలి ద్విజన్ములకు వేదాధ్యయన మవశ్యాచరణీయమైన ధర్మముగా విధించెను. అది అత్యంతాదృష్టఫలదాయకమని సనాతన విశ్వాసము.

'విద్ జ్ఞానే' అను ధాతువునుండి వేద శబ్దము నిష్పన్నమైనదని చెప్పుదురు. కాగా వేదమనగా జ్ఞానమని అర్థము. జ్ఞాన మనగా ఈశ్వర జ్ఞానమనియే తాత్పర్యము. ఈశ్వర జ్ఞానమనుట సకల విజ్ఞానమునకు పర్యాయము. విజ్ఞానమే బ్రహ్మమని శ్రుతి. 'సర్వం వేదాత్ ప్రసిధ్యతి' అని మనువు సర్వమును వేదము వలననే తెలియనగునని చెప్పెను. 'వేదాద్ధర్మో హి నిర్బభౌ' అని సకల ధర్మములు వేదము వలననే వెలసినవని కూడ చెప్పబడినది.

వేద విజ్ఞానము: ముఖ్యముగా ధార్మిక విజ్ఞానము వేదములో ప్రధానముగా ప్రతిపాదింపబడిన విషయజాల మంతయు యాజ్ఞ యాగములకును, కర్మకాండకు ఎక్కువగా సంబంధించినది భగవద్గీతలో యజ్ఞ మనేకవిధములుగా చెప్పబడనది బ్రహ్మయజ్ఞము, ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము, జ్ఞానయజ్ఞము మున్నగునవన్నియు యజ్ఞరూపములే. అవి తిరిగి స్వాత్త్విక, రాజసిక, తామసిక రూపము లంది మువ్విధము లగును. వేదములో అనుకల్పముల గూర్చి చెప్పిన అహింసా మూలకములైన యజ్ఞములతోపాటు సకామ నిష్కామ యజ్ఞ ములు రెండును వర్ణింపబడినవి. పూజ, ఉపాసన, పరోపకారము, నిస్స్వార్థసేవ మున్నగు సర్థములిచ్చు యజ్ దాతువునుండి యజ్ఞ శబ్దము సాధింపబడెను. 'ప్రజాపతిర్వై యజ్ఞః' అని భగవత్స్వరూపమే యజ్ఞమని నిర్వచింపబడెను. ఈశ్వరుడు యజ్ఞపురుషుడు. అతడే యజ్ఞ భోక్త. యజ్ఞాచరణమునకు ఫలము లోక కల్యాణము.

వేదములో యజ్ఞముతోపాటు అధిభౌతిక, అధిదైవిక, ఆధ్యాత్మిక విభూతులెన్నో వర్ణింపబడినవి. ఐహికాముష్మిక సాధనకు వలయు ధర్మము లెన్నియో ఉపదేశింపబడినవి. వేద ప్రతిపాద్యమైన ధర్మము సార్వకాలికమును సార్వత్రికమునైన నిత్యసత్య ధర్మము. అట్టి ధర్మము వలననే ఈ భూమి ధరింపబడినది. ప్రాచీన మహర్షులు ధర్మమును జీవితమున కురిపంచునదిగా పేర్కొనిరి. అవి వారి స్వానుభవము

'సుగా ఋతస్య పంథా' అని ధర్మమార్గ మత్యంత సుగమమైన మార్గమని చెప్పిరి. 'సత్యస్య నావః సుకృత మపీపరన్' అని సత్యమే ధర్మాత్ములగువారిని తరింపజేయుగల నౌకఅని నిశ్చయించిరి.'మాభిషేత్యః ప్రమోదః' అని ఏ ప్రాణియందును ప్రమత్తత పలదని హెచ్చరించిరి. 'ప్రమత్తయోగాత్ ప్రాణవ్యపరోపణం హింసా' అని ప్రమత్తులై యితరుల బాధించుటయే హింసఅని నిర్వచించిరి. 'మా గృధః కస్యస్విద్ధనమ్' అని ఇతరుల ధనమును కాశింపవద్దని బోధించిరి. 'శతహస్త సమాహర సహస్రహస్త సంకిర' అని నూరువిధములుగా సంపాదించి వేయివిధములుగా వెచ్చించుమని ఉపదేశించిరి. 'యతేమహి స్వరాజ్యే' అని స్వరాజ్య సంపాదనకై ప్రయత్నింప నుత్సహించిరి. 'సమానీ ప్రపా, సహవోఽన్నభాగః, సమానే యోక్త్రే సహ వో యునజ్మి' అని సరిసమానములైన అన్నపానములందు, సమానమైన బాధ్యతలు కలిగి, కలసి మెలసి యుండుడని బోధించిరి. ఇట్టి వెన్నోని చూపవచ్చును. ఇవన్నియు దేశకాలాబాధములై సమస్త మానవ జాతికి ఒకే తీరున వన్వయించు నుపదేశములు.

వేదము నిత్యమని సనాతన విశ్వాసము. అది పరమేశ్వరునిచేత నను గ్రహింపబడినదని ఐతిహ్యము. 'తస్య మహతో భూతస్య విశ్వసిత మేతద్ ఋగ్వేదో యజుర్వేదః' ఇత్యాది వచనములు వేదములు పరమేశ్వరుని యూర్పులుగా వ్యక్తమైనవని చెప్పును. ఊర్పు లనుటచేత నవి స్వభావసిద్ధములే కాని ప్రయత్న జన్యములు కావని భావము. పరమేశ్వరునికి ప్రళయము లేదు కనుక వేదములకుకూడ నాశములేదు. ప్రళయ కాలములో అంతర్హితములైన వేదములు ప్రళయాంతమున తిరిగి ఆ పరమేశ్వరుని అనుగ్రహమువలన మహర్షులకు లభించినవని మహా భారతమున వ్రాయబడినది. బ్రాహ్మణములు, అరణ్యకములు, ఉపనిషత్తులు ధర్మశాస్త్రములు, పురాణేతిహాసములు మొదలగు ప్రాచీన వాఙ్మయము నందంతటను వేదములు నిత్యములనియు, అపౌరుషేయము లనియు చెప్పబడెను న్యాయమీమాంసాయోగ వైశేషికవేదాంత దర్శనములే కాదు పురుషానావ ముగ్గడించు సాంఖ్య దర్శనముకూడ వేదము అపౌరుషేయము లనియు చెప్పును.

ఇట్లింతగా చెప్పినను ఈ వాదమునకు ప్రాచీనకాలమునుండి నేటి వరకు ప్రతివాదము వినిపించుచునే యున్నది. హేతువాదమునకు, భౌతిక విజ్ఞానమునకు నెలవైన ఆధునిక కాలమున వేద నిత్యతావాదము నకు మునుపటికంటె ఎక్కువగను, ప్రబలముగను ప్రతిబంధకములు పేర్కొనబడుచున్నవి. అపౌరుషేయవాద మంతకంటె ముందే నిరాకరింప బడుచున్నది. వేదములలోని భాష సర్వత్ర ఒకే రూపమున నుండదు. ఒక్క ఋగ్వేదములోనే కొన్ని మండలములోని భాషకంటె మరి కొన్ని మండలములలోని భాష చాలా అర్వాచీన మనిపించును. ఒక వేదములోని మంత్రమే వేరొకవేదములో స్వరగత, శబ్దగత, అర్థగత భేదములతో కనిపించుటకూడ కలదు. మంత్రద్రష్టలైన ఋషులందరు ఒకే తరమునకు చెందినవారు కారు. కొన్ని ఋషి వంశములు పుత్ర పౌత్ర పరంపర యా మంత్రద్రష్టలై మండలకర్తలైనట్లు చెప్పబడినది. వేదములో వర్ణించిన విషయములు కూడ ఒకే కాలమునకు చెందిన విశ్వాసములపై ఆధారపడి యుండినట్లు తోచదు. ఒకచోట మహో న్నత శక్తి సంపన్నులుగా వర్ణింపబడిన దేవతలు వేరొకచోట సామాన్య మానవులకంటె నీరసులుగా కాన్పింతురు. ఆధ్యాత్మిక విషయములతో పాటు అత్యంత లౌకికమైన విషయములుకూడ వేదములో వర్ణింపబడి నవి. 'స్తోమం జనయామి నవ్యమ్' అని నవీనమైన మంత్ర సమూహ మును తమగొంతమని యుత్సహించు ఋషులు కొందరుండినట్లు వేదము లోనే సాక్ష్యములు దొరకుచున్నవి. ద్వాపరాంతమున సూర్యప్రసాదమున యాజ్ఞవల్క్యునికి శుక్ల యజుర్వేదము లభించినదని ఐతిహ్యము. ఈ యీ రీతి కారణము లిన్ని మరిన్ని చూపి వేదము అపౌరుషేయములని కాని నిత్యమని కాని విశ్వసించుట అసంగతమని అనూచానముగనే వాదింపబడుచున్నది.

వేదము ప్రాచీన ఋషి కల్పితమని నిర్వచించిన పిదప దాని ప్రాచీనతకుగల కాలావధు లెట్టివను శంకాసమాధానములుకూడ వెలసినవి. ప్రాక్ పాశ్చాత్య పండితులెందరో వేదకాలమును నిర్ణయించుటకు ప్రయ త్నించిరి వారు వేద యుగమును పూర్వ యుగమనియు, ఉత్తర యుగమనియు రెండుగా విభజించిరి. పూర్వయుగములో వేదమునందలి

మంత్రభాగమైన సంహితాచతుష్టయము వెలసినదనియు, ఉత్తర యుగములో బ్రాహ్మణారణ్యకాది వైదికసాహిత్యము విస్తరిల్లినదనియు నిర్ణయించిరి సంహితలలో తిరిగి ఋక్సంహిత అన్నిటికంటె ప్రాచీనమైనదని నిర్ణయించిరి ఆధునిక భాషా శాస్త్ర భూగర్భశాస్త్ర పురాతత్త్వశాస్త్ర భౌగోళిక చారిత్రకాధారములతో ఋగ్వేదరచనా కాలమును గురించి యూహాపోహలెన్నియో వెలిపుచ్చిరి. మాక్సుముల్లర్ పండితుడు వేదము క్రీ. పూ. 1200 సంవత్సరముల నాటి రచనమని అభిప్రాయపడెను. వింటర్నిజ్ పండితుడు, వేదము క్రీ. పూ. 2500 నాటిదని నిర్ణయించెను. జాకోబీ పండితుడు కల్పసూత్రములలో, 'ధ్రువ ఇవ స్థిర భవ' అను వైవాహిక కాండములోని మంత్రము నాధారముగాగొని గ్రహ గణితపు సహాయమున వేదమిప్పటి కారువేల సంవత్సరముల క్రిందటి రచనమని తెల్పెను. తిలక్ పండితుడు వసంత ఋతు సంపాతమును గూర్చి వేదములో చెప్పిన నక్షత్రము లాధారముగా, వెనుకకు లెక్కించి, వేదము లారు మొదలు ఎనిమిదివేల సంవత్సరములకు పూర్వము వెలసినవనెను. ఇదే పద్ధతిగా శ్రీవైద్య, దాస్, సంపూర్ణానంద్ మున్నగు పండితులు వేదములిప్పటికి పాతిక మొదలు ఏబదివేల సంవత్సరముల మధ్యకాలమునకో ఇంకను ప్రాచీనకాలమునకో చెందినవని అభిప్రాయపడిరి శ్లెగల్, నీబరు మున్నగు పండితులు వేదములు మన యూహకందరానంత ప్రాచీనములని అంగీకరించిరి. ఇట్లే ఇంకెందరో పండితులెన్నో విధములుగా లెక్కించి తలకొక విధముగా చెప్పిరే కాని నేటి వరకు మనిశ్చితముగా ఈ కాల నిర్ణయము జరుగ లేదు, సంప్రదాయజ్ఞులైన సనాతన లీవాదములకు పోరు. వా రెవ్వరును వేద మనాది అనియే చెప్పుదురు. వేదములోని భాషాచ్ఛంద స్స్వరవర్ణ్య విషయాదిగత వైవిధ్యమునుకూడ వారు శాఖాభేద మంగీకరించి పరిహరింప జూచెదరు. "సాక్షాత్కృత ధర్మాణో ఋషయో బభూవుః తే అవరేభ్యోఽసాక్షాత్కృత ధర్మేభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః" అను నిరుక్తకారుని వాక్యముల ననుసరించి మంత్రద్రష్టలైన ప్రాచీన మహర్షులు ఆర్షి ప్రజ్ఞలేని యితరుల కవి యుపదేశించిరనియు, వారు తిరిగి ఆ శ్రుతిని శిష్య పారంపర్యమున లోకములో వ్యాపింపజేసి రనియు, అధ్యేతృభేదము చేత శాఖాభేదము లేర్పడినవనియు, అదేకారణమున భాషాగత, అర్థగత

స్వరగతాది భేదములు వచ్చినవనియు, అట్లే విధితోపాటు అర్థవాదం, ఐతిహ్య, నారాశంసీ లౌకికేతివృత్తములకు సంబంధించిన సూక్తములు కూడ వేదములో చోటుచేసికొన్నవనియు. కాని అవేవియు వేద నిత్యత్వాపౌరుషేయత్వములకు బాధకములు కాజాలవనియు సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

వేదములో వివిధ విషయములు వర్ణింపబడినవి. అవి సరిగా తెలియవలెనన్నచో వేద మంత్రముల కర్థము తెలియవలెను. వేదమున కర్థ మేమంత సులభము కాదు. వేదార్థము కొంతవరకు బ్రాహ్మణములలో వివరింపబడినది. మరి కొంత ప్రాతిశాఖ్య పదపాఠ కల్పసూత్ర సర్వానుక్రమణ్యాది గ్రంథములలో వెల్లడింపబడినది చెదురుమదురుగా నున్న ఆ యా విధమైన అర్థవివరణాదులన్నియు ప్రోగుచేసి నిఘంటులేర్పచిన పిదప నిరుక్తములో మరి కొంత అర్థవిస్తార మొనర్పబడినది. మీమాంసాన్యాయ దర్శనాదులు వేదార్థమును వివరించుట కింతను తోడ్పడినవి. ఇతిహాస పురాణములు మరి కొంత సహాయమొనర్చినవి. అధునికులు కొందరు వేదమునకు కేవల భౌతికార్థమునే వివరింతురు. మరి కొందరు కేవలం ఆధ్యాత్మికార్థమునే గ్రహింతురు. కాని వేదములో అధిభౌతిక అధిదైవిక ఆధ్యాత్మిక తత్త్వము అన్నియు వర్ణింపబడినవి. ఉవ్వటుని మతమున వేదములో విధి, యాచనా, ఆశీః, స్తుతి, ప్రైష, ప్రవహ్లికా, ప్రశ్న, వ్యాకరణ తర్క, పూర్వానుకీర్తన, అవధారణ, ఉపనిషదంశము అన్నియు గోచరించును. యాస్కాచార్యుడు వేద మంత్రములను ప్రత్యక్షకృత, పరోక్షకృత, ఆధ్యాత్మికములుగా విభజించి, తన నాటికిగల నైదాన, నైరుక్త, ఐతిహాసిక, బ్రహ్మవాది, యాజ్ఞిక, పరివ్రాజక, స్వరముక్తవాది సంప్రదాయము అన్నిటిని సంప్రదించి. నిరుక్తములో వేదార్థమును వివరించుటకు యత్నించెను. సాయణాచార్యుడు వేదభాషను సమాధిగత, పరకీయ, లౌకికభేదములచే మువ్విధములుగా గ్రహించి, ప్రయోగ, నిరీక్షణ, వ్యవహార, నిర్వచన అఖ్యాన, సమనుగమనాది తత్త్వము లెన్నిటినో గమనించుచు వేద భాష్యములు వెలయించెను.

పరమేశ్వర ప్రణీతము అగుటచేత వేదమంత్రములు అర్థదృష్ట్యా మాత్రమేకాక శబ్దదృష్ట్యా, స్వరదృష్ట్యాకూడ మహనీయమైనవి. మంత్రములోని స్వరముగాని ఉచ్చారణగాని మారినచో అర్థము భేదించును. అట్లే మంత్రములోని శబ్దక్రమముగాని వర్ణక్రమముగాని మార్చుటకు వీలు లేదు. ఈ యీ విషయములన్నిటిని యథాతథముగా మంత్రద్రష్టలైన ఋషుల నాటినుండి నేటివరకు వేదపాఠములు మిక్కిలి జాగరూకతతో పాటించుచు రక్షించుచుంటిరి. అందుకే విద్యాభ్యాసము గురుముఖమువనే విధేయమైనది వేదమునకు శ్రుతి యను పేరు దీని వలననే సార్థకము. మంత్ర రక్షణకై పద, క్రమ, జటా, మాలా, శిఖా లేఖా ధ్వజ, దండ, రథ, ఘనములను పాఠభేదములెన్నియో అనుసరింప బడుచున్నవి. వీనిలో మంత్రగత శబ్దములు విలోమానులోమద్విరావృత త్రిరావృతాది పద్ధతులతో తత్తద్విహిత స్వరవిశేషతతో మరల మరల చదువబడును. ఈ యీ కారణముల వలన వేదములో ప్రక్షిప్తములకు గాని పాఠాంతరములకు గాని అవకాశము లభింపలేదు. భేదమున్నచోట నెల్ల అది శాఖాభేదమూలకమేగాని ప్రమాదమూలకమైన భేద మేదియు లేదు

మొదటి నొకే రాశిగనున్న వేదములకు యజ్ఞోపయోగార్థము వ్యాసమహర్షి నాలుగు వేదములుగా విభజించెను. ఛందోబద్ధములైన మంత్రములను ఋగ్వేదముగను, గద్యాత్మకమైన మంత్రములతో కొన్ని ఛందోబద్ధములైన పద్యాత్మకములుగానున్న మంత్రములను జేర్చి యజుర్వేదముగను, గేయాత్మకమైన మంత్రములను సామవేదముగను నేర్పరచి, యీ త్రయీభిన్నమైన మంత్రము లన్నిటిని అథర్వణ వేదములో చేర్చి వ్యాసుడు వీటిని వరుసగా తన శిష్యులైన పైల, వైశం, పాయన, జైమిని, సుమంతులనే వారిచే చదివించెను వారివద్ద నిని తిరిగి వారి శిష్యప్రశిష్యులచే పఠింపబడినవి. కాలాంతరమున వీ అధ్యేతృ భేదముచేత వేదము వేలాదిశాఖలుగా వి స్తరిల్లినది. పతంజలి ననుసరించి ఋగ్వేదమునకు 21, యజుర్వేదమునకు 100, సామవేదమునకు 1000, అథర్వణ వేదమునకు 9 శాఖలు వెలసినవి. కాని నేడు మనకు ఋగ్వేద శాఖ ఒకటి, యజుశ్శాఖ లైదు, సామవేద శాఖలు మూడు, అథర్వణ

శాఖలు రెండు, మొత్తముచేరి వదునొకండు శాఖలు మాత్రమే మిగిలినవి. శాఖలకు చరణములనికూడ పేరు.

ప్రతి వేదశాఖకును ప్రత్యేకముగా సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము, ఉపనిషత్తులు, ప్రాతిశాఖ్యములు, శ్రౌతసూత్రములు గృహ్యసూత్రములు మున్నగు వాఙ్మయముండును. ఈ విషయములో కూడ మనకిప్పుడు లభించుచున్న వేద శాఖలలో కొన్ని ధ్యయంసంపూర్ణ ములుగా లేవు.

యజ్ఞములో హోత ఋగ్వేదమును. అధ్వర్యుడు యజుర్వేదము, ఉద్గాత సామవేదమును, బ్రహ్మ అథర్వణవేదమును వాడుదురు 'మంత్ర బ్రాహ్మణాత్మకో వేదః' ఇత్యాది వాక్యముల ననుసరించి సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము, ఉపనిషత్తులు అను నాలుగంగములుగా ప్రతి వేదము గ్రహింపబడును. వేదములోని మంత్రములన్నిటికి ఋషి ఛందోదేవతా వినియోగాదులు చెప్పబడినవి 'ఋషిర్దర్శనాత్' అని చెప్పినదాని ననుసరించి ఏ మంత్రమును నే మహర్షి దర్శించెనో అతడే ఆ మంత్రమునకు ఋషియని పేర్కొనబడును. ఋక్కు (మంత్రము) లన్నియు ఛందోబద్ధమై యుండును. ఛందములు మంత్రగుప్తికి అక్క రక్షణకు ఉపయోగించునవని చెప్పుదురు. ఈశ్వరాదేశరూపమైన నిగూఢ జ్ఞానమును కలిగించునవి మంత్రములు 'మన్యతే శక్తిర్నియతే దేవతా విశేషః అనేన' అను నిర్వచనము ననుసరించి విశిష్టదేవతాస్తుత్యాత్మక మైన పద్యములు మంత్రములనిపించుకొనును ఒకొక్క మంత్రమున కొకొక్క అభిమానదేవత యుండును. దేవతా శబ్దము స్త్రీ లింగము. అది ఈశ్వరాభిన్నమైన తదీయ శక్తికే పర్యాయము. విశ్వమంతటను వివిధరూపములతో వెలసిన ఈశ్వరశక్తిని విభిన్నదేవతా రూపములుగా మంత్ర మూలమున నుపాసింతురు. మంత్రమును నిర్దుష్టముగా ఉచ్చ రించినచో కలుగు కంపనము తదధీనమైన దేవతాశక్తిని మేల్కొల్పునని విజ్ఞులందురు. ఏ మంత్ర మే క్రియలో వినియోగింపవలెనో చెప్పు వాక్యములకు వినియోగ వాక్యములని వ్యవహారము. ఈ విషయము లన్నియు అనుక్రమణికలు బృహద్దేవతాది గ్రంథములు విశేషముగా వివరించును. వేదాంగములైన శిక్షాచ్ఛందో వ్యాకరణ నిరుక్త కల్ప జ్యోతిషములు కూడ వేదార్థ వివరణమునకు యజ్ఞనిర్వహణమునకు తోడ్పడునట్టివే. ఇవన్నియు కలసి వేదవాఙ్మయమని పిలువబడును.

# ఋగ్వేద సంహిత

వేద చతుష్టయములో ఋగ్వేదము ప్రధానమైనది. సంహితా సర్వస్వములో ఋగ్వేదమే సగభాగ మాక్రమించును. వరిగణనకు ప్రాచీనతకుకూడ ఋగ్వేదమే ప్రథమము. సామవేదములోని సూక్తము లన్నియు నించుమించుగా ఋగ్వేదములోనివే. అథర్వణ వేదములో సుమారు 1200 వరకు ఋగ్వేదములోని సూక్తములే మరల వినిపించును. యజుర్వేదములోకూడ ఋగ్వేద మంత్రములెన్నియో గోచరించును. ఈ విధముగా ఇది వేదములన్నిటికి మూలమనిపించును. "తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే" ఇత్యాది శ్రుతివచనముల వలన విధియే ముందుదయించినట్లు తెలియును. "యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా క్రియతే శిథిలం తద్ యద్ ఋచా తద్ దృఢం" అని యజు స్సామముల ప్రయోగమునే యజ్ఞక్రియకు శైథిల్య మేర్పడు ననియు ఋక్ప్రయోగమునే అది సుదృఢముగా సంతరింపబడుననియు చెప్పుట వలన దీని మహత్త్వమెట్టిదో విశద మగుచున్నది.

ఛందోనియమము కలిగి పాదవ్యవస్థతో నున్న మంత్రములకు ఋక్కు అని పేరు. "అర్చ్యతే ప్రశస్యతే అనేన దేవవిశేషః ఇతి ఋక్" అని దీనివలన దేవతలు ప్రశంసింపబడుదురని నిర్వచించబడినది. సంహిత యనగా సంకలనమని అర్థము. ఋక్కులన్నియు ఒకచోట సంగ్రహింపగా నేర్పడిన గ్రంథమే ఋగ్వేదసంహిత. పతంజలి ననుసరించి ఋగ్వేదమునకు 21 శాఖలు. చరణవ్యూహము ననుసరించి వీనిలో శాకల, బాష్కల, శాంఖాయన, మాండూకేయ, అశ్వలాయన శాఖ లైదును ముఖ్యమైనవి.

నేడు మనకు శాకల శాఖకు సంబంధించిన సంహిత మాత్రమే లబ్ధమగుచున్నది కాగా ఋగ్వేదసంహిత యనగా శాకలసంహితయనియే గ్రహింపవలెను. ఇది 8 అష్టకములుగా విభక్తమైనది. అష్టకమున కెనిమిది చొప్పున దీనిలో 84 అధ్యాయము లున్నవి, ప్రతి అధ్యాయము కొన్ని వర్గములుగా విభజింప బడినది. కాగా మొత్తము 2009 వర్గ లిందు న్నవి. మూడు మొదలు తొమ్మిదివరకు ఒక్కొక్కవర్గులో ఋక్కులు లేక మంత్రములుండును. ఋక్సంహితను వేరొక పద్ధతిలో కూడ విభజించిరి.

ఈ పద్ధతిలో ఇది పది మండలములుగా పేర్కొనబడును. మండలములన్నియుచేరి 85 అనువాకములుగను అవి తిరిగి 1028 సూక్తములుగను విభజింపబడెను. కొన్ని మంత్రములు చేరి ఒక సూక్తమగును. అట్టి మంత్రములు, ఋగ్వేదములో 10580¼ కలవని అనుక్రమణికలు లెక్కించినవి కాత్యాయన సర్వానుక్రమణిలో మంత్రములే కాదు. మంత్రాక్షరములుకూడ లెక్కింపబడినవి. వైదిక సాహిత్య పరిరక్షణకై మనపూర్వులెంత జాగరూకులై యుండిరో తెలియుట కిది చాలును.

ఋక్సంహితలోని రెండవ మండలము నుండి ఏడవ మండలము వరకుగల భాగములొక్కొక్కటి ఒక్కొక్క ఋషివంశము వారిచే దర్శింపబడిన మంత్ర భాగములుగా పేర్కొనబడినవి. అవి వరుసగా గృత్స మద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజ, వసిష్ఠ ఋషి వంశము లని. ఈ కారణముచేత వీనికి వంశ మండలములు, లేక గోత్రమండలము లని పేరు వచ్చినది. ఋగ్వేదములోని ఎనిమిదవ మండలము కణ్వ - అంగిరస గోత్రీకులు దర్శించినది. సోమ (పవమాన) దేవతనుగూర్చి వేరేరు ఋషులు దర్శించిన మంత్రములన్నియు ఒకచోట చేర్చి తొమ్మిదవ మండలములలో సంగ్రహించిరి. అది కారణముగా దీనిని సోమ (పవమాన) మండలమని పేర్కొందురు ప్రథమ మండలములో సుమారు ఇరువదిముగ్గురు ఋషులు దర్శించిన మంత్రములున్నవి. దశమ మండలములోకూడ ఎందరో ఋషులు దర్శించిన మంత్రములు సంగ్రహింపబడినవి, ఈ మండలములో కొందరు రాజర్షులు ఋషికలుకూడ పేర్కొనబడిరి. భాష, వర్ణ్య విషయము మున్నగు వానినిబట్టి ప్రథమ మండలములో కొంతభాగమును, దశమ మండల మంతయును అర్వాచీన రచనమని అభిజ్ఞులు చెప్పుదురు.

ఋగ్వేదములోని మంత్రము లన్నియు స్వర ప్రధానములు. ఈ స్వరము లయాత్మకముగా గోచరించును. మంత్రములు సుమారు పదునైదు వరకుగల వేర్వేరు ఛందములలో రచింపబడినవి, వైదికచ్ఛందము అక్షరగణనము, పాదవ్యవస్థ, పాదాంత్యవర్ణములలో కొంతవరకు గురులఘు క్రమ విన్యాసము మున్నగు లక్షణములతో నుండును వైదిక

సూక్తములలో కొన్ని విషమచ్ఛందములు కూడ గోచరించును. కొన్ని ప్రగాథచ్ఛందములుగా రూపించును. సూక్తాంతమున ఛందము మారి సూక్త సమాప్తిని సూచించుచుండును.

వేదము ధర్మ మూలము. ధర్మము యజ్ఞరూపమున ననుష్ఠింప బడును. యజ్ఞ సిద్ధియే వేదములకు పరమ లక్ష్యము.[1] యజ్ఞములో ఆ యా దేవతలు తత్తత్ స్తుతి పరములైన మంత్రములచే ఆహ్వానింప బడి హవిర్భాగము లందజేయబడుదురు. ఋగ్వేదములో నట్టి దేవతాస్తుతి పరములైన మంత్రములే ముఖ్యముగా సంగ్రహింపబడినవి. యజ్ఞములో హోత యీ మంత్రములను పఠించి ఆయా దేవతల నాహ్వానించి స్తుతించుచుండును. అగ్నిముఖమున వారు తమ తమ యజ్ఞ భాగము లందుకొందురు.

వైదికదేవతలు పృథివ్యంతరిక్షద్యుఃస్థానీయులుగా ముప్విధములు. పృథివీస్థానీయ దేవతగా అగ్ని ఋగ్వేదములో సుమారు రెండు వందల మంత్రములచే స్తోత్రము చేయబడెను. అంతరిక్ష స్థానీయ దేవతలలో ఇంద్రుడు ప్రధానముగా వర్ణింపబడెను. అట్లే ద్యుఃస్థానీయులలో సూర్యుడు ముఖ్యముగా స్తుతింపబడెను. వేరు వేరు నామములతో వీరే మరల మరల వర్ణింపబడు చుందురు ఋగ్వేదము 1-139-11 ననుసరించి పృథివీస్థానీయులు 11, అంతరిక్షస్థానీయులు 11, ద్యుఃస్థానీయులు 11, మొత్తము 33 గురు దేవతలు ముఖ్యులు. శతపథ బ్రాహ్మణములో వసు రుద్రాదిత్యులు ద్యావా పృథివీద్వయముతో కలిసి 33 గురు దేవతలుగా పేర్కొనబడిరి. ఋగ్వేదములోనే స్థానాంతరమున (3-9-8, 10-52-6) దేవతల సంఖ్య 3339గా చెప్పబడినది విశాల మహిమాన్వితులు అనంత శక్తి సంపన్నులు అయిన దేవతల సంఖ్య ఎట్లు ఎంతని చెప్పినను అది ఔపచారికమే అనియు, వాస్తవమున కందరుచేరి ఒకే నిత్య సత్యమైన పరమతత్త్వమున కంగ రూపములనియు చెప్పుదురు. "మహాభాగ్యాత్ దేవతాయాః ఏక ఏవ ఆత్మా బహుధా స్తూయతే. ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవంతి" అని నిరుక్తములో ఇదే విషయముల్లేఖి-పబడినది.

1. అగ్నివాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్ ।
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజుస్సామలక్షణమ్॥ (మను 1-23)

"తస్యా మహాభాగ్యాత్ ఏకైకస్యా బహూని నామధేయాని భవంతి" అని ఆ ఒకే పరమాత్మకు విభిన్ననామ (రూప)ములు కల్పింపబడిన వని దుర్గాచార్యుడు వ్యాఖ్యానించెను. "మహద్దేవతా నామ సురత్వ మేకమ్" అని ఋగ్వేదము 3-35-22లోకూడ ఇదే సత్యముద్ఘోషింపబడెను. కాఃగాః ఋగ్వేదములో వర్ణించిన దేవతలందరు 'ఏకం సత్' అని చెప్పబడిన ఒకే ఒక పరతత్త్వమునకు వరి వరి విధములుగా కల్పించుకొనిన నామ రూపాత్మకమైన విభూతి బాహుళ్యమనియే యెంచవలెను 1 కాగా వర్ణించిన దేవతా భౌతిక స్వరూపముతోపాటు, తదధిష్ఠానదేవతాతత్త్వ రూపమును, తన్మూలమైన పరమాత్మ తత్త్వమును కూడ ప్రతి మంత్రమునందును ఉద్దేశింపబడినవనియే తెలియవలెను. ఈ దృష్టితో చూచినచో వేదములో వర్ణించిన ఇంద్రాగ్ని వరుణాదిత్య పవమాన మరుదశ్వినులేమి, అదిత్యుషః సరస్వత్యాది దేవతలేమి, మన్యుశ్రద్ధాదులేమి, అన్నియు ఒకే పరమాత్మకు చెందిన, తదభిన్నమైన శక్తులుగా రూపించును వేదములో ఆ యా దేవతలు విభూత్యైశ్వర్యమండితులుగను, ఋతస్వరూపులుగను, సత్యసూనులుగను వర్ణింపబడిరి. ఏ దేవతను వర్ణించినపు డా దేవతయే అన్నిటిని మించిన దేవతగా వర్ణింపబడును. తిరిగి ఒకదేవత కింకొక దేవతతో అభేదము చెప్పబడును. వేర్వేరుగా వర్ణించుచునే చివర కన్నియు ఒకటే అని చెప్పబడుచుండును. ఒకటి సత్యమై తక్కిన వసత్యములగుటకాని, ఒక దేవత కింకొక దేవత నీరసమగుట కాని లేదు. స్త్రీ పురుష విభేదముకూడ పరతత్త్వములో గోచరింపదు. ఒకే దేవతను వరి వరి విధములుగా కల్పించినట్లే వేర్వేరు దేవతల నొకే దేవతగా సాక్షాత్కరింపజేసి కొనుటయు గోచరించును 2 దేవతాస్వరూపవిషయమున నిట్టి సంక్లిష్ఠరహస్య కల్పనలుండుటచేతనే వీని పరిజ్ఞానవిషయమున నత్యంత జాగరూకులై యుండవలెనని సనాతనులు హెచ్చరించెదరు. దేవతా స్వరూపము తెలియనిదే మంత్రమును వినియోగించి ప్రయోజనము లేదని ఘంటాఘోషముగా చెప్పుదురు.

వేదితవ్యం దైవతం హి మంత్రే మంత్రే ప్రయత్నతః ।
దైవతజ్ఞో హి మంత్రాణాం తదర్థ మవగచ్ఛతి ॥
నహి కశ్చి దవిజ్ఞాయ యాథాతథ్యేన దైవతమ్ ।
లౌక్యానాం వైదికానాం వా కర్మణాం ఫలమశ్నుతే ॥

అని బృహద్దేవతలో ప్రతి మంత్రమునకు చెప్పిన దేవతనెరిగినవారికే మంత్రార్థమవగతమగుననియు, దాని యాథార్థ్యమెరుగనిదే ఆచరించిన లౌకిక వైదిక కర్మలకు ఫలము శూన్యమనియు చెప్పిన పంక్తులు వైదిక ధర్మమును. వేదమంత్రములను గూర్చి చర్చించునపుడు ముఖ్యముగా గమనింపదగినవి.

వేదము సకల విజ్ఞానమునకు మూలము. వైదికార్థ్యల ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక పంపదౌన్నత్యము లేవి తెలియవలెనన్నను వేదమే పరమాధారము. ఋగ్వేదములో ఆనాటి లౌకిక జీవితమును పారలౌకిక విశ్వాసమును పరమార్థ చింతనముసుకూడ అద్దములో వలె దర్శింపవచ్చును. దశమకుండల మీరీతి విషయము లెన్నిటినో తెలియజేయును. సృష్టి రహస్యమును గూర్చి గహన గంభీరమైన విచికిత్స నొనర్చు నాసదీయసూక్త మీ మండలములో 129వ సూక్తము. దీనిలో సృష్ట్యాదిని అసత్ గాని సత్ గాని లేదనియు, పృథివ్యాకాశములు గోచరింపవనియు, ఆవరణశూన్యమైన తత్ స్థితిలో జలమున్నదేమో తెలియదనియు, మృత్యువుగాని, అమరత్వముగాని, దివారాత్రవిభేదముగాని లేవనియు చెప్పి, 'అనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించనాస' అని వాయుశూన్యమైన ఆ స్థితిలో ఆత్మావలంబనముచే శ్వాసప్రశ్వాసలొనర్చుచున్న ఆ పరతత్త్వ మొక్కటి తప్ప మరేదియు లేదనియు వర్ణింపబడెను. ఇదే మండలములోని 120వ సూక్తము హిరణ్య

---

1. ఇంద్రం మిత్రం వరుణమగ్ని మాహుః,
ఆథోదివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।
ఏకం సద్విప్రా బహుధా వదంతి,
అగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥
(ఋ 1-164-46)

2. ఏక ఏవాగ్నిర్బహుధాసమిద్ధ,
ఏకః సూర్యో విశ్వమను ప్రభూతః ।
ఏకైవోషాః సర్వమిదం విభాత్యే
కం వా ఇదం విబభూవ సర్వమ్ ॥
(వాలఖిల్య 10-2)

గర్భసూక్తము, దీనిలో పరమపురుషవిచికిత్స యొనర్పబడెను. ఇందు లోని మంత్రములన్నియు 'కస్మై దేవాయ హవిషా విధేమ' అను ధ్రువ వాక్యముతో నంతమగుచుండును. 'కస్మై' అను పదమున 'కెవరికి' అని కాక, నామరూపాదుల కందక అనిర్వచనీయమై వెలుగు 'పరబ్రహ్మ తత్త్వమునకే' అను నర్థమనుసంధింపవలెనని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. ఈ సూక్తములో సృష్టికిముందే హిరణ్యగర్భుడు వెలసెననియు, అతడే పురుషుడనియు, ఈ విశ్వమున కతడే భర్త, ధర్త, శాసకుడు, సర్వముననియు, ఆపురుషుడే దేవాదిదేవుడనియు వర్ణింపబడినది.

'పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం' అని పురుష (పరబ్రహ్మ) తత్త్వమే యీ గోచరాగోచర సర్వ ప్రపంచముననియు, జరిగినది జరుగనున్నదికూడ ఆ పురుషుడేఅనియు అతడీ విశ్వమంతటినీ ఆవరించినను పైగా కొంత మిగిలి యుండుననియు, అతనిలో నొక చతుర్థ భాగమీ భూత సృష్టియనియు మిగిలిన మూడు భాగములు అమృతశీలమైన దివమనియు, అతనినుండియే యీ విరాడ్రూప ముదయించిన దనియు, తిరిగి దీని నుండియే అతడు వెలసెననియు చెప్పి వర్ణించు పురుషసూక్త మీ మండలములో 90వ సూక్తము చాతుర్వర్ణ్య ప్రశంస యిదె సూక్తములో స్పష్టముగా తొలిసారి వినిపించును.

ఈ మండలములోని నదీసూక్తములో గంగాయమునలు వర్ణింపబడినవి. దానసూక్తములో 'కేవలాఘో భవతి కేవలాదీ' అని తనకు తానై వండుకొని వేరొకరికి పెట్టక భుజించువాడు పాపమునే భుజించునని చెప్పబడినది. ఋగ్వేదములోని దానసూక్తములలో ఎందరో దాతలు ప్రశంసింపబడిరి. దానమాహాత్మ్య ముగ్గడింపబడినది అట్లే ద్యూతకార విలాపసూక్తములో 'అక్షైర్మా దీవ్యః కృషి మిత్ కృషస్వ, విత్తే రమస్వ బహుమన్యమానః' అని జూదమాడవలదనియు, కష్టపడి కృషిచేసి ధన ధాన్యములంది గౌరవముగా జీవింపవలసినదనియు ముపదేశింపబడెను. ఈ సూక్తములో జూదగాని యవస్థ అత్యంత దయనీయముగా వర్ణింపబడెను. అరణ్యానీ సూక్తములో ప్రాకృతిక దృశ్యము అతి మనోహరముగా వర్ణింపబడినవి. ఓషధీసూక్తములో రోగనిదాన నివారణోపాయములతోపాటు వనౌషధు లెంతగనో వర్ణింపబడినవి.





భౌతిక విషయములయ్యును పారలౌకికతత్త్వముతో మేళవించు వివాహము అంత్యేష్టివంటి లౌకిక కర్మలకు సంబంధించు సూక్తము లీ మండలములో కనిపించును. వైదికార్యులు కన్యలను గౌరవించిరి. ధనధాన్యములిచ్చి సాలంకారముగా కన్యాదానము లొనర్చిరి. దౌహిత్రులను వారసులుగా సంగీకరించిరి, స్త్రీని గృహస్వామినిగా, సామ్రాజ్ఞిగా పేర్కొనిరి. విదుషీమణులైన లోపాముద్ర, ఘోష, విశ్వావార, లోమశ, శచి మున్నగువారు మంత్రద్రష్టలైన ఋషికలుగా నెంచబడిరి. స్త్రీలు యజ్ఞకార్యములలో పాల్గొనుచుండిరి వీరపత్నులై, వీరమాతలై మనుట వారి యాదర్శము వేదకాలమునాటి ప్రజల ఆత్మకు చావులేదని యెఱుగుదురు సత్కర్మలకు సద్గతులను, దుష్కర్మలకు దుర్గతులను, ఫలములని గుర్తించిరి. చనిపోయిన వ్యక్తికి ఉత్తరగతులలో యముడు తోడ్పడునని విశ్వసించిరి దేవయాన పితృయాన మార్గములను, పితృలోకమును గూర్చి వారు ఊహించి తెలిసికొనిరి

జలప్రళయ దాశరాజ్ఞ యుద్ధాదులు వర్ణించు కథానకసూక్తములతో పాటు ఋగ్వేదములో కొన్నిసూక్తములు సంవాదరూపమున కూడనున్నవి వీనిలో ఊర్వశీపురూరవ సంవాదము, సరమాపణి సంవాదము, యమయమీ సంవాదము వంటివి మిక్కిలి ప్రసిద్ధములు. ఇవి తరువాతి పురాణ సాహిత్యములో విస్తరించి వర్ణింపబడినవి.

వైదికార్యుల కాముష్మికచింత ఎంతయెక్కువో ఐహికచింతకూడ అంతయెక్కువ వారీ రెంటిని సమానముగా నరచేతికి దెచ్చుకొనిరి. "జీవేమ శరదశ్శతం అని చెప్పుచునే "పశ్యేమదేవహితం యదాయుః" అని తీర్మానించుకొనిరి శాంతి కాములై సంపత్సౌఖ్య ప్రదాయకమైన ఐకమత్యమును ద్బోధించుచు

"సమానీవ ఆకూతిః సమానా హృదయాని వః
సమానమస్తు వో మనో యథా వస్సు సహాసతి॥"

అని లోకుల పరస్పరాధ్యవసాయములు, హృదయములు, మనస్సులు ఏకీభవించి, సంఘీభావము పెంపొందవలెనను సదాశయము వెల్లడించిరి.

# యజుర్వేద సంహితలు

యజుర్వేదములోని మంత్రములుకొన్ని నియతాక్షరావసానాదికములై పాదబద్ధములైన ఛందములుగా నుండును మరికొన్ని కేవలము గద్యాత్మకములై యుండును ఋక్ సామ భిన్నములైన మంత్రములన్నియు యజుర్వేదములో సంకలింపబడినవి "శేషేయజుః" అను మీమాంసా సూత్రము వివరించును కాని ఋగ్వేదములోని మంత్రములు కొన్ని యజుర్వేదములో కూడ వినిపించును యజ్ఞవిధానమును దృష్టిలో నుంచుకొని చేసిన విభాగము కనుక ఆ యా విధమైన సంకలన మావశ్యకమై యుండవచ్చును. యజుశ్శబ్దము దేవపూజా సంగతికరణ దానాదులకు పర్యాయము. యజ్ఞాచరణము దేవతాప్రీతికొరకు. దానివలన సువృష్టికలిగి, లోకము సుభిక్షమై సమస్త ప్రాణికోటికి సుఖశాంతిమయమైన జీవనము కలుగునని విశ్వాసము.

యజ్ఞనిర్వహణమునకు వలసిన మంత్రభాగమును, తన్నియామకమైన బ్రాహ్మణభాగమును కూడ చేర్చి యజుః సంహిత సంతరింపబడెను. యజ్ఞాచరణమునకు వలయు కాలజ్ఞానమునకై జ్యోతిశాస్త్రమును, యజ్ఞవేదీనిర్మాణ విధి పరిజ్ఞానమునకై వాస్తుశాస్త్రమును, మంత్రార్థనిర్ణయమునకై శిక్షావ్యాకరణ శాస్త్రాదులును యజుర్వేదము ననుసరించి వికసించినవి, యజ్ఞములు హావిర్యజ్ఞ, సోమయజ్ఞ, పాకయజ్ఞములని ముప్విధములు ఇవితిరిగి ఒక్కొక్కటి ఏడేసి విధములు, గృహస్థులు నిత్యము జరుపుదేవ, ఋషి పితృ, మనుష్య, భూతతర్పణాదులు కూడా యజ్ఞములే రాజసూయము, అశ్వమేధము సర్వమేధము మున్నగునవి విశేషయజ్ఞములు ఇవి దీర్ఘసత్రములు రాజులో, రారాజులో నిర్వహింపదగినవి

యజుర్వేదము బ్రహ్మ సంప్రదాయ మనియు, ఆదిత్య సంప్రదాయ మనియు రెండు విధములగా ప్రచారమునకు వచ్చినది మొదట దీనిని వ్యాసునివద్ద వైశంపాయనుడు చదివెను అతనివద్ద నేర్చినశిష్యులలో యాజ్ఞవల్క్యుడను నతడు మిక్కిలి ప్రతిభాశాలి ఏదోకారణమున అతనికి గురువుతో వివాదమేర్పడెను ఫలితముగా గురువు తానిచ్చినవిద్య తిరిగి తనకిచ్చి పొమ్మనెను.

యాజ్ఞవల్క్యుడు తానునేర్చినదంతయు వమనముచేసి వెడలిపోయెను, అతడు విడివినదానిని తిత్తిరిపక్షులు గ్రహించెను తరువాత ఇది "కృష్ణయజుర్వేద మను పేర లోకములో ప్రచారమునకు వచ్చెను, దీనినే బ్రహ్మ సంప్రదాయ మనికూడ చెప్పుదురు, యజ్ఞవల్క్యుడు గురుని విడివి చనినవెనుక సూర్యు నారాధించెను సూర్యుడాతని తపోనిష్ఠకు సంతసించి, వాజిరూపమున ప్రత్య క్షమై అతనికి వేదవిద్య ప్రసాదించెను, ఇట్లు సూర్యునిచేత ప్రసాదింపబడి యాజ్ఞవల్క్యునిచే ప్రచారమునకు తేబడిన వేదము శుక్లయజుర్వేదమను పేర ప్రసిద్ధమయ్యెను దీనినే ఆదిత్య సంప్రదాయమునకు చెందినదని చెప్పుదురు యాజ్ఞవల్క్యుని పూర్వులు అన్నదానముచేసి "వాజసేని" అని బిరుదుపొంది రట. వాజసనేయుడైన యాజ్ఞవల్క్యునికి, వాజిరూపుడైన సూర్యునిచేత మధ్యాహ్నవేళ లభించుటచేత శుక్లయజుర్వేదమునకు 'వాజసనేయసంహిత' అనియు, 'మాధ్యందినసంహిత' అనియుకూడ పేర్లువచ్చినవి. ఇది కేవల మంత్రాత్మకము కనుక దీనికి శుక్లయజుర్వేదమనియు, శుక్లేతరమై బ్రాహ్మణ భాగసమ్మిశ్రితమై యుండుటచేత వైశంపాయనోదితమైన సంహితకు కృష్ణ యజుర్వేదమనియు పేర్లు వచ్చినట్లుకూడా చెప్పుదురు శుక్లయజుర్వేదులు ఉత్తరదేశములో హెచ్చు కృష్ణయజుర్వేదులు దక్షిణమున హెచ్చు. వర్ణ్య విషయమునుబట్టి చూచినచో శుక్లకృష్ణ సంహితలకు ఏమంత అధికమైన భేదము కనబడదు కానిరచనలో శుక్లయజుర్వేదము కేవల మంత్రాత్మకము గను కృష్ణయజుర్వేదము మంత్రభాగముతోపాటు తన్నియామక బ్రాహ్మణ భాగములుకూడ చేరుటచే గద్యపద్యాత్మకముగను కాన్పించును

సూతసంహిత, బ్రహ్మాండపురాణము. స్కాందపురాణము ముక్తికో పనిషత్తు మున్నగునవి యజుర్వేదమునకు శతాధికముగా శాఖలేర్పడినట్లు చెప్పెను 'ఏకశత మధ్వర్యుశాఖాః' అని పతంజలి దీనికి నూరుశాఖలున్నట్లు చెప్పెను చరణవ్యూహములో దీనికి 86 శాఖలు మాత్రమే కలవని వ్రాయ బడెను కానినేడు మనకు శుక్లయజుశ్శాఖలు రెండును, కృష్ణ యజుశ్శాఖలు నాల్గునుచేరి మొత్తము ఆరు శాఖలకు మాత్రమే సంహితలున్నవి. లభించు చున్నవి. వీనికి తిరిగి కొన్ని ఉపశాఖలున్నట్లు చెప్పుదురు.

శుక్లయజుర్వేదశాఖలకు సంబంధించినంతవరకు మనికిప్పుడు లభ్య మగుచున్నవి మాధ్య దిన, కణ్వసంహితలు 2 మాత్రమే. వీనిలో మాధ్యం దినసంహిత మిక్కిలి ప్రసిద్ధము దీనినే 'వాజసనేయసంహిత' అని కూడ పేర్కొందురు ఇది 40అధ్యాయముల గ్రంథము దీనిలో చివరి 15అధ్యా యములను ఖిలాధ్యాయములని పేర్కొందురు అధ్యాయము లన్నియు చేరి 303 అనువాకములుగను, 1975 కండికలుగను విభజింపబడినవి కండి కలే మంత్రములు ఈసంహితలోని మొదటి అధ్యాయమునకు ప్రజాపతియు అంతిమాధ్యాయమునకు దండ్య . అధర్వణుడును ఋషులుగా చెప్పబడిరి సంహితలో చేర్చుకున్నను 100 అధ్యాయములుగల శతపదబ్రాహ్మణము ఈ సంహితకే సంబందించును కాణ్వసంహితలో ఈసంహితకన్న 111 కండికలు (మంత్రములు) హెచ్చు, ఆసంహితలోకూడ ఖిల్యశుక్రీయ మంత్ర ములు కలిపియేయున్నవి. కాణ్వలోకప్పుడు ఉత్తరప్రదేశములోనుండినట్లు సాహిత్య కాదారములు సాక్ష్యమిచ్చును నేడు దక్షిణదేశములో స్వల్పంగా నున్నట్లు వినికిడి సాయణాచార్యుడు కణ్వసంహితకు భాష్యము వ్రాసెను వాజసనేయమునకు ఉవ్వట మహీధరాదుల భాష్యములు దొరకుచున్నవి

వాజసనేయసంహితలో అనేక యజ్ఞములు వివరింపబడినవి దర్శ పూర్ణమాసేష్టులు, అగ్నిహోత్రము, చాతుర్మాస్యము మున్నగునవి మొదట వర్ణింపబడినవి ఇవిహవిర్యాగములు ఆమీద అగ్నిష్టోమాది సోమయాగ ములు వర్ణింపబడినవి, సోమయాగములో సోమలతనుదెచ్చి విధ్యుక్తముగా నూరి రసముగ్రహించి, దానిలోపాలు మున్నగునవి కలిపి, ప్రాతర్మధ్యాహ్న సాయం సవనములు జరుపుదురు ఒకేదినములో పూర్తియగు యజ్ఞమునకు 'ఏకాహ' మనిపేరు ఇట్లేసవము, సత్రము మున్నగునవి ఆయా యజ్ఞనిర్ణీత కాలమునుబట్టి కొన్నిదినములుమొదలు సంవత్సరము, లేదా ఇంకను ఎక్కువ కాలము వరకు జరుగునట్టి యాగములు జ్యోతిష్టోమము, వాజపేయము మున్నగునవి మిక్కిలి శ్రేష్ఠమైన యజ్ఞములు రాజ్యాభిషేకము, రాజసూ యము మున్నగునవికూడ ఈసంహితలో వర్ణింపబడినవి రాజసూయంలో ద్యూతక్రీడ, అస్త్రక్రీడవంటి ప్రసంగములు కొన్నియుండను అగ్నిచయన మనుయాగములో 10800 ఇటికలుపేర్చి గరుడాకృతిగా వేదినిర్మింతురు.

దీనికి అధ్యాత్మికార్థముకూడ వివరి పబడినది. శతరుద్రీయము రుద్రయాగి మునకు సంబంధించును నసోర్ధారా సౌత్రామణ్యాది యజ్ఞములు కూడ ఈ సంహితలో వివరింపబడినవి సౌత్రామణిలో సురాప్రయోగముకూడా జరుగును పురుషమేధాదులు ఖిలాధ్యాయములలో చెప్పబడినవి. పురుషమేధములో 186వరకు అలంభనము లుండును కానిఇవన్నియు ప్రతీకాత్మకములు 'నృత్తాయ సూతం గీతాయ శైలూషం' మున్నగు వాక్యములలో చెప్పబడిన ఆలంభనములు ఆనాటివృత్తులను, కళలనువివరించును పురుషసూక్తములో ఈసంహిత మరికొన్ని మంత్రములు అధికముగా చూపును సర్వమేధము, అశ్వమేధము మున్నగు యజ్ఞములు చక్రవర్తులు నిర్వహింపదగినవిగాను, రాష్ట్రీయతా భావనిర్మాణ క్షమములైనవిగాను ఈసంహితలో వర్ణింపబడినవి, ఇందలి 34వ అధ్యాయమునకు శివసంకల్పోప నిషత్తని పేరు 3౦నుండి 39వరకు గలఅధ్యాయములు పితృమేధాది పాకయజ్ఞములకు సంబంధించినవి అంతిమాధ్యాయమున ప్రసిద్ధమైన ఈశావాస్యోపనిషత్తు వినిపించును సంహితలో చోటుచేసికొనిన ఉపనిషత్తు ఇదిఒక్కటియే సమస్త ఉపనిషద్విజ్ఞానమునకు మూలమనదగిన ఇందలి మొదటిరెండుశ్లోకములు (మంత్రములు) గాంధిమహాత్మునికి మిక్కిలి ప్రియమైన నిత్యానుసందాన శ్లోకములు భగవద్గీతకు వలె ఈ శ్లోకములకు కూడ నేడుమిక్కిలి ప్రచార మిచ్చినది ఇట్టి ఉపనిషత్తుతో బ్రహ్మప్రాప్తియే చరమ లక్ష్యమని సూచించు ఈ సంహితముగియును కాణ్వసంహితలో కూడ ఇంచుమించుగా ఇదేవిషయములువర్ణింపబడినవి పాంచరాత్రాగమములకు కాణ్వసంహితతో సన్నిహితసంబంధ మున్నట్లు చెప్పుదురు.

కృష్ణయజుర్వేదమునకు చెప్పిన శాఖలలో నేడు మనకు తైత్తిరీయ మైత్రాయణీ, కఠశాఖకు సంబంధించినంతవరకు సంపూర్ణ సంహితలు లభించుచున్నవి. కపిష్ఠల-కఠశాఖకు చెందిన సంహిత అసంపూర్ణముగా దొరుకుచున్నది వీనిలో తైత్తిరీయశాఖ మిక్కిలి ప్రసిద్ధము యాజ్ఞవల్క్యుడు వమనముచేసిన వేదమును ఈశాఖకు 'తైత్తిరీయశాఖ' అని పేరు వచ్చినట్లు చెప్పుదురు. కాని 'ఆపస్తంబానుక్రమణిలో' తిత్తిరి అనుఋషి పేరొకటి వినిపించును, తిత్తిరిచే ప్రచారమునకు తేబడినశాఖ యగుటచే నిదితైత్తిరీయ

మని పిల్వబడెవనికూడ చెప్పుదురు. ఇదిసమగ్రమైన వేదశాఖ అనగా దీనికి సంబంధించి నంతవరకు సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము, ఉపనిషత్తు శ్రౌతసూత్రములు, గృహ్యసూత్రములు మున్నగు సాహిత్యమంతయు లభించుచున్నది.

తైత్తరీయసంహిత ఏడుకాండలుగా విభజింపబడినది ఇవితిరిగి 651 అనువాకములుగను, 2198 కండికలుగను విభజింపబడినవి ఇది సాయణుని శాఖ. ఈసంహితకే అతడుతొలుదొల్త భాష్యమువ్రాసెను. అదియజ్ఞమేకాక ఆద్యాత్మ. అదిదైవపరమలైన అర్థములుకూడ అతనిభాష్యములో అయా సందర్భముల ననుసరించి వ్రాయబడినవి తైత్తిరీయసంహితకు శాకల్యుడు క్రమపాఠము వ్రాసెను, గాలవుడు పదపాఠము చేర్చెను, కొందరీ పదపాఠమును ఆత్రేయ విరచితమని చెప్పుదురు ఈ శాఖనుయాయులలో పెక్కుమంది అపస్తంబసూత్రులు ఈసంహితలో మంత్రబ్రాహ్మణములు కలసియుండును. కృష్ణయజుస్సంహిత లన్నింటికిని ఈధర్మము సమానము.

తైత్తిరీయ సంహితలోకూడ ఎన్నోయజ్ఞములు చెప్పబడినవి, పౌరోడాశము, యాజమానము, వాజపేయము, రాజసూయము మున్నగునవి దీనిలోవిస్తరించి వర్ణింపబడినవి వాజసనేయసంహితలోవలె దీనియందను సినీవాలీవర్ణనమున్నది, ఒకచోటదీర్ఘరాత్రుల ప్రసంగము గొచరించును. సువాసునివృత్తాంతము, పాంచాలకౌంతేయాదుల ప్రశంసలు వరాహావతారవర్ణనము కాలకంజాసురుని కథ, చండామార్కులచర్చ మున్నగు పౌరాణిక ప్రసంగములెన్నియో ఈసంహితలో వినిపించును. అశ్వమేధము వంటి యాగములు కొన్ని దీర్ఘకాలికములు, అట్టియాగములలో రాత్రులందు ఇతిహాసపురాణములు పఠించుట విధి, ఇట్టి కథాసముదాయములనుండి కాపాడి యజ్ఞానుష్ఠానము దుత్సాహులుగా నుంచును.

కృష్ణయజుర్వేదమునకు చెందిన వేరొకశాఖ మైత్రాయణిశాఖ దీనికి కలపశాఖ'అని నామాంతరమున్నది. దీనిఉపశాఖలలో మను, వరాహశాఖ ప్రసిద్ధములు. మనుస్మృతి వరాహత్వసూత్రము అనునవి వీనికి సంబందించిన గ్రంథములు. మైత్రాయణీసంహిత మంత్రబ్రాహ్మణాత్మకమై 4కాండలు

54 ప్రపాఠకములు, 634 అనువాకములు కలిగి, 2144 మంత్రములతో నున్నది. దీనిలో 1701 వరకు ఋగ్వేదమంత్రములే తిరిగి వినిపించును ఈసంహితలోని ఖిలభాగములో మొదట చెప్పిన యాగములే మరికొంత విస్తరించి వర్ణింపబడినవి

కృష్ణ యజుర్వేదీయ కాఠకశాఖ పూర్వమొకప్పుడు మధ్యదేశమున మిక్కిలిప్రచారములో నుండినట్లు గ్రామేగ్రామే కాఠకం కాలపకంచప్రోచ్యతే అనుపతంజలివాక్యము సాక్ష్యమిచ్చుచున్నది. కఠసంహితతో ఇఠమిక,మధ్యమిక, ఓరమిక యాజ్యానువాక్య, అశ్వమేధాద్యనువచన కాండలని అయిదు ఖండములున్నవి ఈ ఖండములలోని అవాంతర భాగములకు స్థానకములని పేరు అవితిరిగి అనువచనక, అనువాక మంత్రభాగములుగా విభజింపబడినవి ఈ సంహితలోకూడ పురోడాశ, అధ్వర, పశుబంధ, వాజపేయ, రాజసూయాదులతో పాటు సావిత్రి, పంచచూడ, స్వర్గదీక్షత, అయుష్యసత్ర, ప్రాయశ్చిత్త ,సవ,సౌత్రామణ్యాదులెన్నో యజ్ఞయాగములు వివరింపబడినవి. దీనిలో పురోడాశ బ్రాహ్మణము, యజమాన బ్రాహ్మణము మున్నగు బ్రాహ్మణ భాగములు గోచరించును

చరణవ్యూహము ననుసరించి చరకశాఖలో ప్రాచ్యకఠులను, కపిష్ఠలకఠులును అంతర్గతులని భావింపబడుదురు పాణిని కపిష్ఠలుడను ఋషని పేర్కొనెను నిరుక్తవాక్యర్త దుర్గాచార్యుడు తాను కపిష్ఠల వాసిష్ఠుడనని చెప్పుకొనెను. కురుక్షేత్ర ప్రాంతమున కపిష్ఠలమను గ్రామముండినటు బృహత్సంహితాదుల వలన తెలియుచున్నది. బహుశ ఈశాఖీయులాప్రాంతమునకు చెందినవారు కావచ్చును ఏదిఏట్లున్నను ఈ కపిష్ఠల కఠశాఖకు చెందిన సంహితప్రతి ఒకే ఒకటి మిక్కిలి అసంపూర్ణముగా నేడుదొరుకుచున్నది కాఠసంహితతో దీనికి చాలాభేదము కనిపించుచున్నది. దీనిలోని స్వరాంకనపద్ధతి కూడ ఋగ్వేదస్వరాంకన పద్ధతిని పోలికాన్పించును,

కృష్ణ యజుస్సంహితలన్నియు ఇంచుమించుగా ఒకేవిషయమును వివరించును. క్రమముమాత్రము భిన్నముగానుండును. ఋగ్వేదమునకువలె

యజుర్వేదమునకు వివరణగ్రంధము లంతగాలేవు. ఆకారణమున, యజు స్సూక్తములకు ఋష్యాదులు సరిగాతెలియవు. సూత్రగ్రంధములలో నచ్చు టున్నట కొందరు కాండర్షులు పేర్కొనబడిరి అటివారిలో ప్రాజాపత్య, సౌమ్య, అగ్నేయ, వైశ్వదేవ, స్వాయంభువాదుల. కొందరు ప్రసిద్ధులు అట్లే సాంహితీ వారుణీ యాజ్ఞికి మున్నగు దేవతలుకూడా క్వాచిత్కముగా చెప్ప బడిరి, యజుర్వేదములో దేవతాబాహుళ్య మెట్లున్నను, ప్రతి చిన్నవిషయ మును—అది చేతన ప్రాణియైనను, జడపదార్థమైనను—దేవతాత్మగనే భావించి దానితో సాన్నిహిత్య మేర్పరచుకొను ప్రయత్నము కానవచ్చును. శైవ వైష్ణవ, సంప్రదాయము లానాటికి స్పష్టముగా నెలకొనినట్లు రూపించును. ఈ విశ్వమంతటను ఒకేఒక శక్తి, ఒకేఒకఆత్మ నిండియున్నదను విశ్వాస ముతోపాటు, ప్రాప్తమైనదేదో అది ఆపరమాత్మ ప్రసాదించినదే అను నిశ్చ యముకలిగి, ఉత్సాహముతో కర్మాచరణ మొనర్చుచు జీవితమును ప్రశాం తముగా నడుపుకొను పద్ధతి గోచరించును. రాజసూయాశ్వమేధాది యజ్ఞ ముల ద్వారా రాష్ట్రీయత, దేశభక్తివంటి ఉదాత్తభావములు ప్రచారమునకు తెచ్చినట్లు కనిపించును. అనాటి సమాజములో విద్వాంసులు గౌరవింపబడిరి బ్రహ్మచారిణులు, సుశిక్షితలు అయిన కన్యలే వివాహమునకు యోగ్యలని యెంచబడిరి. నృత్తగీత వాద్యాది కళలతోపాటు ఆయా వృత్తులు కూడా అనాటికెన్నో వెలసినవి. యజ్ఞవిధాన వైవిధ్యముతోపాటు, యజ్ఞాంగము లును, వాటినిగూర్చి వివరించు సూత్ర వాఙ్మయమును కూడా విస్తారముగా వెలయసాగినవి.



# సామవేదసంహితలు

'వేదానాం సామవేదోఽస్మి' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పిన గీతా వాక్యము వలన సామవేదమునకుగల ఉత్కృష్టత స్పష్టమగుచున్నది. ఛాందోగ్యములో 'సామ్న ఉద్గీథో రసః' అని చెప్పబడినది. ఉద్గీథ అనగా ఓంకారము. "ప్రణవః సర్వవేదేషు", "ఓంకారః సర్వవేదానాం" ఇత్యాది వచనముల వలన ఓంకార ప్రాశస్త్యము తేటపడును. ఇట్లు ఓంకారమూలకమైనదగుటచేతనే సామవేదము వేదముల కెల్ల తలమానికము వంటిదని భావింపబడుచున్నది. 'సామాని యోవేత్తి సవేదతత్త్వమ్' అని సామ మెరిగినవానికే తత్త్వజ్ఞాన మబ్బునని చెప్పబడినది. ఋగ్వేదములో పలుచోట్ల సామము ప్రశంసింపబడినది. వైరూప, బృహత్, రైవత, గాయత్ర, భద్రాది సామములు కొన్ని ఋగ్వేదములో పేర్కొనబడినవి. యజుర్వేదములో రథంతర, వైరాజ, వైఖానస, వామదేవ్య, శాక్వర, రైవత, అభీవర్తాది సామములు పేర్కొనబడినవి. 'ఋచం సామయజామహే' అని అథర్వవేదము కూడ సామమును కీర్తించినది. ఐతరేయమున నైధస, కారవ, యౌధాజయ, అగ్నిష్టోమీయ సామములు స్మరింపబడినవి. 'నసామ యజ్ఞోభవతి' అని సామము లేనిదే యజ్ఞమే లేదని చెప్పబడినది.

సామవేదములోని మంత్రములు నూటికి 95 పాళ్ల వరకు ఋగ్వేదము నుండి గ్రహింపబడినవే. 'ఋచి అధ్యూఢం సామ' అని ఋక్కులనే ఆధారముగాగొని సామము లేర్పడుటచే ఛాందోగ్యమున వీనికి పతిపత్నీభావమూహింపబడినది. బృహదారణ్యకములో 'సా చ అమశ్చేతి తత్ సామ్నః సామత్వమ్' అని ఋక్కులపై గాంధారాది స్వరములు చేర్చినందున సామమేర్పడుననియు కనుకనే అది సామము, అనగా గానము, అని పిల్వబడుననియు చెప్పబడినది. 'గీతిషు సామాఖ్యా' అని జైమిని గేయమంత్రములకే సామమను పేరు వర్తించునని చెప్పెను.

వేదవ్యాసుని వద్ద మొదట ఈ సామవేదమును జైమిని చదివెను. అతని వద్ద నుండి ఋది అతని శిష్యప్రశిష్యులకు సంక్రమించెను. శిష్యప్రశిష్యులు బాహుళ్యము శాఖాబాహుళ్యమునకు తావిచ్చి ఋది సహస్రశాఖలుగా విస్తరిల్లెను. ఒకప్పుడు దీనికి ఉదీచ్య ప్రాచ్యగాన లని రెండు ముఖ్యశాఖాభేదము లుండెను. కాని నేడు సామవేదులు దాక్షిణాత్య ప్రతీచ్యశాఖానుయాయులుగనే కాన్పిం

చురు, శాఖలు కూడ మూడే మిగిలినవి. వానిలో కౌథుమశాఖ గుజరాతులోని నాగర బ్రాహ్మణులలో నిలిచినది. రాణాయణీశాఖ మహారాష్ట్రములోను, దక్షిణమున రామేశ్వర ప్రాంతమునను మిగిలినది. జైమినిశాఖ కర్ణాటకమున ప్రచారములో నున్నది. ఈ మూడిటి సంహితలును అచ్చయినవి.

కౌథుమీయసంహితకు సాయణాచార్యుడు బాష్యమువ్రాసెను. ఈ సంహిత పూర్వార్చికమనియు ఉత్తరార్చికమనియు రెండుభాగములు. పూర్వార్చికమునకు ఛందసీ, ఛాందసికా అని కూడ నామాంతరము లున్నవి. ఇది 6 ప్రపాఠకములుగా విభక్తమయినది. ప్రతిప్రపాఠకమునకు రెండధ్యాయములు (అర్థములు)ను అవి తిరిగి (కొన్ని ఖండములు) ఛందోదేవతాదికము ననుసరించి సంకలితము చేసిన పదేసి మంత్రములుగను విభజింపబడెను. మొదటి అయిదు ప్రపాఠకములును ఆగ్నేయ ఇంద్ర పవమాన పర్వము (సామము) లకు సంబంధించును. ఆరవప్రపాఠకములో అరణ్యక పర్వము (సామము) లున్నవి. ఉత్తరార్చికము కూడ 9 ప్రపాఠకములుగను 29 అధ్యాయములుగను విభజింపబడినది దీనిలో దశరాత్ర, సంవత్సర, ఏకాహ, అహీ , సత్ర, ప్రాయశ్చిత్త, క్షుద్రభాగములు వర్ణింపబడినవి. రాణాయణీయ సంహిత కూడ ఇదే పద్ధతిలో పూర్వార్చికము 6 ప్రపాఠకములుగను, ఉత్తరార్చికము 9 ప్రపాఠకములుగను విభజింపబడెను ఉత్తరార్చికములో మొదటి అయిదు ప్రపాఠకములకు రెండేసి అర్థములను వివరనల్గింటికి మూడేసి అర్థములును ఏర్పడినవి. ప్రతి అర్థమును కొన్ని దశతులు (ఖండములు)గా విభజింపబడెను పూర్వోత్తరార్చికములు రెండిటిలోను గల 1824 మంత్రములలోను కొన్ని మంత్రములు పునరుక్తమలై వినిపించును. ఇంచుమించుగా మంత్రములన్నియు ఋగ్వేదములోనివే. 75 వరకు కౌథుమిలో ఋగ్వేదీయశాకల సంహితలో లేని మంత్రములున్నవి. కౌథుమశాఖలోనే తాండ్యశాఖ అంతర్గతమనియు, తాండ్యబ్రాహ్మణము దీనికి సంబంధించినదనియు చెప్పుదురు. రాణాయణీయములో ఉచ్చారణభేదము గోచరించును. కౌథుమిలో హా ఉ. రా ఇ అని ఉచ్చరించినవి ఇందులో హా వూ, రా యీ అని ఉచ్చరింపబడును సౌత్యాముగ్రిశాఖ దీని అవాంతరశాఖ దీనిలో హ్రస్వ ఎ ఒ అక్షరములు వినిపించును. జైమినీయసంహితలో కౌథుమీయ సంహితలోకన్న మంత్రములు తక్కువగా నున్నను గానములు ఎక్కువగా కనిపించును. తలవకార శాఖ దీనికి అవాంతరశాఖ కేనోపనిషత్తు ఈ ... ... సంబంధించును

సామసంహితలన్నియు, ఆర్చికము లనియు, గానము లనియు రెండు విధములు ఋక్కులకే ఆర్చికమ లని పేరు కాగా, ఆర్చికములలో సామ గానమున కుపకరించు మంత్రము లన్నియు సంగ్రహింపబడినవనియు, గాన సంహితలో అవే మంత్రములు గేయరూపములో సంతరింపబడిన వనియు తెలియగును. సామగానము 4 విధములు. (1) గ్రామగేయగానము. ఇది గ్రామములో పాడదగినది దీనిని వేదగానమనికూడ పేర్కొందురు (2) అరణ్యగేయగానము. ఇది అరణ్యములో పాడదగినది. గ్రామగేయ, అరణ్య గేయములకు ప్రకృతిగానములని వ్యవహారము దీని ననుసరించి (3) ఊహ గానము, (4) ఊహ్యగానము అనునవి వికసించును మొదటిరెండును పూర్వార్చికమునకును చివరిరెండును ఉత్తరార్చికమునకు సంబంధించును. సామగాన విధానము ఉత్తరార్చికములో కొంత వివరింపబడినది. ఋక్ ప్రాతిశాఖ్య, తైత్తిరీయ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, పుష్పసూత్ర, సామసూత్ర, నారదశిక్షాదులలో మరికొంత విస్తారముగా ఈ విషయము వర్ణింపబడినది.

నారదీయశిక్షలో సామస్వరములు 7 చెప్పబడినవి అట్లే 3 గ్రామ ములు, 21 మూర్ఛనలు, 49 తానములు పేర్కొనబడినవి. సామసప్తస్వర ములు వేణువులో వరుసగా 'మ గ రి స ని ధ ప' అను స్వరములకు సరిపో వును. సామగాన పాఠములలో స్వరములు 1 నుండి 7 వరకు అంకె వేసి చూపబడును. ఉచ్చైస్తారమను స్వరము 11 అంకెతో చూపబడును సామ మంత్రములతో స్వరచిహ్నములుంచు పద్ధతి దీనికి భిన్నము. గాన భాగములో సంగీతానుకూలముగ చేసిన మార్పులు సామవికారములని పిలువబడును. అవి ఈ క్రింది పద్ధతిలో ఆరు విధములుగా నుండును.

(1) వికారము — 'అగ్నే' అనుటకు బదులు 'ఓగ్నాయి' అనుట

(2) విశ్లేషణము — 'వీతయే' అనుటకు 'వోయితోయాయి' అనుట.

(3) వికర్షణము — 'యే' అనుదానిని 'యా 2,3, యి, అని పాడగించుట.

(4) అభ్యాసము — 'తయే' అనుచోట 'తోయాయి, తోయాయి' అని రెండు సార్లు పలుకుట

(5) విరామము — 'గృణానో హవ్యదాతయే' అను పదమును 'గృణా నోహ, వ్యదాతయే' అని విరిచి పదవుట

(6) స్తోభము — ఔ, హోవా, హావు, అ, మున్నగు నవి ఊతపదములుగా చేర్చిపాడుట.

సామగానములో పదములు విరిచి చదువునప్పుడు ఛందస్సుగాని. అర్థముగాని గమనింపరు. 'సామవేదే గీతి ప్రధానే అ వ్యత్తిప్యర్థో నాద్రియతే' అని సామగాన ప్రసంగములో అర్థముతో నిమిత్తములేదని స్పష్టముగా చెప్పబడినది. ఛాందోగ్యములో సామగానము హింకార, ప్రస్తావ, ఆది, ఉద్గీథ, ప్రతిహార, ఉపద్రవ, నిధనభాగములు కలదిగా చెప్పబడినది. హింకారము ఓంకారతుల్యము ప్రస్తావమనునది ఆరంభగానము దీనిని ఋత్విజుడారంభించును ఉద్గీథ ఓంకారము. దీనిని ఉద్గాత పఠించును. ప్రతిహారమనగా రెండింటిని కలుపునది యని అర్థము దీనిని ప్రతిహర్త చదువును. ఒకప్పుడిది రెండుగా విరిచి చదువుదురు. అందొక భాగమునకు ఉపద్రవమని పేరు. దీనిని ఉద్గాతగానము చేయును నిధన మనునది మంత్రములోని అంతిమ భాగము ఓంకారము దీనిని ఋత్విజులు ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహర్త ముగ్గురు చదువుదురు. 'అగ్న ఆయాహివీతయే' ఇత్యాదిగా గల మంత్రము పై విధముగా గానము చేసినప్పుడు ఈ క్రిందిచూపిన విభాగపద్ధతిలో గోచరించును.

ఓం అగ్న ఇ (ప్రస్తావము).

ఓం ఆయాహివీతయే, గృణానోహ వ్యదాతయే. (ఉద్గీథ)

ని హోతా సత్సి బర్హిషి ఓం. (ప్రతిహారము).

ని హోతా సత్సిబ. (ఉపద్రవము).

ర్హిషిఓం. (నిధనము).

ప్రతి మంత్రమును మూడుసార్లు చదివి గానము చేసి పూర్తి చేయుదురు. ఈ గానములో కృష్ట, ప్రథమా, ద్వితీయా, చతుర్థీ, మంద్ర, అతిస్వార్య అనులయలు పాటింపబడును. దుందుభి, వేణువు, వీణ వంటి వాద్యములు కూడ ఉపయోగింతురు. ప్రతిఛందమును సామానుకూలముగా మార్చి గానము చేయబడును. కాని సంహితలో ఉన్న మంత్రము లన్నిటికిగానము చెప్పబడలేదు యజ్ఞములో హోత గానము లేని కేవల మంత్రములు చదివి, ఆయా దేవతలను స్తుతించును. 'అప్రగీతమంత్రసాధ్యస్తుతిః శస్త్రం' అని ఈ విధమైన (గానము లేని) మంత్రస్తుతిని శస్త్రమను పేర వ్యవహరింతురు. "ప్రగీతమంత్రసాధ్యాస్తుతిః స్తోత్రం" అని గానయుక్తమైన మంత్రస్తుతిని స్తోత్రమందురు. దీనిని ఉద్గాత గానము చేయును.

స్తోమములను పేర స్తుతి భేదములు 6 వరకు చెప్పబడినవి. త్రివృత్ పంచ దశాదులైన యీ స్తోమములు తృచ (మూడేసి మంత్రములుగల సూక్తము) మీద ఏర్పడును. తృచను మూడుసార్లు చదివి ప్రతి పర్యాయమును సామ గానమును ఆవృత్తి చేయుచుందురు. ఈ విధముగా ఆవృత్తి చేసినగానము విష్టుతి (విశేషస్తుతి) అని పిలువబడును సామగానములో ఉద్గాతకు ప్రస్తోత ప్రతిహర్త్రాదులు సహాయకులుగా వ్యవహరింతురు. స్తోభగానమునకు వేరే సహాయకులుందురు.

నాలుగు వేదములకు నాలుగు ఉపవేదములున్నవి ''తత్రర్గ్వేదస్య ఆయుర్వేద ఉపవేదః, యజుర్వేదస్య ధనుర్వేదః, సామవేదస్య గాంధర్వ వేదః అథర్వవేదస్య, శస్త్రశాస్త్రాణి'' ఇత్యాది వచనముల ననుసరించి సామ వేదమునకు గాంధర్వము ఉపవేదముగా చెప్పబడును గాంధర్వమనగా గాన కళ ఛాందోగ్యములో ఘోర అంగిరసుడను ఋషి దేవకీపుత్రుడైన శ్రీకృష్ణు నికి వేదాంత విద్య ఉపదేశించినట్లు చెప్పబడినది. శ్రీకృష్ణుడీవిద్య నుపాసించి బాలిక్యగానమును వెలయించెననియు, అది యాదవులలో ప్రచారమందిన దనియు, మురళిపై కృష్ణుడీ గానమునే వినిపించెడివాడనియు చెప్పుదురు ఏది ఎట్లున్నను సామవేదము గానకళకు మూలమనుట తథ్యము. సామసప్త స్వరములకు వేణువుపై నూదబడు స్వరస్థాయీ విన్యాసముతో గల పోలికలు నారదీయశిక్షాదులలో వివరింపబడినవని ముందు వ్రాసితిని. కాని నేడు సామ గానము చేయుపద్ధతిలో ఈ స్వరములు సుస్పష్టముగా తెలియవు. శాస్త్రము నకును వ్యవహారమునకును కొంత ఎడమున్నట్లున్నను, అది సంప్రదాయ భేద మూలకమని అంగీకరించి వ్యవహారమే బలీయమని చెప్పుదురు.

యజ్ఞములో సోమపానమెంత రుచ్యమో సామగాన మంత మధురము దేవతాస్తోత్రపరముగా ఆయా సామములు గొంతెత్తి పాడుచున్నప్పుడు ఉద్గా త్రాది ఋత్విజుల ఉత్సాహము సభికులకునుకూడ ఉత్సాహపరచుచుండును. ఒకానొకరసాత్మకమైన వాతావరణము యాగశాలయందంతటను నెలకొనును ఈగానరసమునకు సోమరసముచేయూత ఇచ్చినట్లుండును. యజ్ఞములోసోమా హరణాది ప్రసంగములు చాల రసవంతములు, సోమమనునది ఒక లత. ఋగ్వేదములో ఈ లత మూజవానపర్వత ప్రాంతమునను కురుక్షేత్రము లోని శర్యణావత్ ప్రదేశములలోను దొరకునని చెప్పబడినది. ఇది నదీ తీరములలో నాచువలె పెరుగునట, పర్వతప్రాంతములలో లతవలె పెరుగు

నట. దీనికి పర్వతావృధ, గిరిష్ఠ మున్నగు పేర్లు చెప్పబడినవి. చంద్రునితో సామ్యము చెప్పి చంద్రకళలతో పాటు పెరుగుచు తరుగుచు నుండు ఆకులు గలదిగా వర్ణింపబడినది. కొందరిది అరటి దుంపవంటి దుంప అనియు, లతగా ప్రాకుననియు, నీటిలో తేలుననియు, దీనికి 15 ఆకులుండుననియు, అధర్మపరుల కిది కనబడదనియు చెప్పుదురు నిజమునకిది యీనాడు కనబడదు. ఆపస్తంబునినాటికే ఈలత దేశములో మృగ్యమైనట్లున్నది అతడే దీనికి అనుకల్పములు చెప్పెను. ఈ అనుకల్ప విధిననుసరించి యీనాటి యజ్ఞములలో సోమలతకు మారుగా కారుగచ్చనో తిప్పతీగెనో వాడుదురు.

సోమయాగములలో సోమాహరణమే ఒక పెద్ద కలాపము సోమాహరణ సూక్తములకు సౌపర్ణ సూక్తములని పేరు: సోమలతను అధ్వర్యుడును యజమానియు కొందురు. దానిని 36 అంగుళములపొడవు, 18 అంగుళముల వెడల్పు గల అభిషవణఫలకము మీద కృష్ణాజినము పరచి, దానిపైనుంచెదరు. అమీద దాని నభిమంత్రించుచు నీటితో తడుపుచు నాలుగు శిలాయంత్రములతో నూరుదురు. తరువాత దానిని ఆహవనీయపాత్రలో వేసి నీరు ఓడ్చి లతను పిండి నీళ్ళలో కలుపుదురు; కసవుతీసిన లతకు 'ఋజీష' అని పేరు. దీనిని దశాపవిత్ర వస్త్రములో మూటగట్టినట్లు కట్టి రసముధారగా పడునట్లు వడియగట్టుదురు. ఈ విధముగా పిండినరసము ముందు దేవతల కిచ్చి హోమముచేసి వషట్కారములు చెప్పుదురు: ఆ మీద హోమావశేషమును ఉద్గాత, యజమాని, బ్రహ్మ, సహస్రకుడు గ్రహింతురు. ఆయా దేవతల కర్పించునపుడు సోమరసమును పాలు, పెరుగు, నేయి, సువర్ణరజము మున్నగువానితో కలిపి అర్పించెదరు. యజ్ఞదినములలో ఈ కలాపము దినమునకు మూడు సారులు జరుపుదురు. సోమరసమును మధువనీ, మధుమత్ అని, పీయూషమనీ వ్యవహరింతురు. ఆయా వస్తువులు కలిపినపుడు దీనిని ఆశిర, గవాశిర, యవాశిర మున్నగు పేర్లతో వ్యవహరింతురు.

సుశ్రుతములో సోమరస భేదములు ఇరువది నాలుగు వరకు వేదోక్తములుగా వర్ణింపబడినవి ఇది సువర్ణపాత్రలో త్రాగవలసినదిగా చెప్పబడినది దీనివలన హర్షోత్సాహమునలేకాదు బ్రహ్మజ్ఞానోదయమునకనుకూలించు స్వస్థతకలుగునని వివరింపబడినది ఇది అమృతము. విపద్ధ బుద్ధియు నిర్మలజ్ఞానమును దీని ఫలములు, సురదుర్మద.

పలుకులు సురదుర్మద అది నిందనీయము. సౌత్రామణివంటి యాగములలో సురాప్రయోగము కూడ విధించబడినన్నూ,సురకన్న సోమముత్కృష్టమనియు, అది మత్తు కలిగించుననియు, ఇది చిత్తస్వాస్థ్య మిచ్చుననియు తెలియజేయు మంత్రములు ఋగ్వేదములో పలుచోట్ల కన్పించును. పైగా ఆధ్యాత్మికముగా అర్థము వివరించునపుడు సోమరసమునకు నిర్మలజ్ఞానము, బ్రహ్మానంద రసము మున్నగు సాంకేతికార్థములు గ్రహింతురు.

సామవేదము ముఖ్యముగా యజ్ఞప్రయోగమునకే ఏర్పడినట్లుండును. దీని మంత్రములన్నియు ఋగ్వేదమునుండి గ్రహించినవే గానమే దీని సొంతము అయినను ఆ గానము ప్రణవనిర్భరమై తత్పరిణామమై తదేకాలంబనమై వెలయుచుండుటచేత సామము సర్వోత్కృష్టమైన విద్యగా భావింపబడుచున్నది ఛాందోగ్యమున సామసారమగు ఉద్గీథవిద్య, ఆధ్యాత్మిక, అధిదైవిక, ఆదిభౌతిక, సంపదలకు మెరుగు సమకూర్చునదిగా వర్ణింపబడినది. సోమయాగములో సోమదేవతాకమైన మంత్రము లెన్నియో సామవిధానము ననుసరించి గానము చేయబడును. బహిష్పవమానాది సూక్తముల వంటి (ఋత్విజులందరు సామూహికముగా గానము చేయునట్టి) ప్రసంగములీ యజ్ఞములలోవలె దర్శ, పూర్ణమాసాదులలో కలుగవు ఇట్లే యజమానికిష్టకామ్యార్థము లొనగూర్చుటకై, ఆయా దేవతల నుద్దేశించి తత్తత్ స్తుతిపరములైన సూక్తములు గానముచేయుదురు. ఒకొక్క దేవత కొకొక్కవిధమైన స్తోభాక్షరములు ప్రయోగించుదురు. గానముచేయు ఋత్విగ్విభేదము ననుసరించి యిట్టి సామ స్తోత్రములను ప్రస్తావభక్తి, ఉద్గీథభక్తి, ప్రతిహారభక్తి అనికూడ వ్యవహరింతురు సామము దేవతలకు ప్రియమైనది. లోకవ్యవహారములోకూడ సామమనగా ప్రియముపలుకుట, నయము సమకూర్చుట అనియే అర్థము. శ్రుతికూడ 'యత్ ఖలు సాధు తత్ సామ' అని ఏది సాధువో అనగా ఏది శుభావహమో శోభనమో అదియే సామమని కీర్తించినది

# అథర్వవేద సంహితలు

వేదచతుష్టయములో అంతిమము అథర్వవేదము. ఇది ఆముష్మికముతో పాటు ఐహికమునకుకూడ సమప్రాధాన్యమిచ్చునట్టి వేదము. థర్వ శబ్దమునకు కుటిలత అని అర్థము. అ కుటిలమై, సహజమై ఐహికాముష్మికోపయోగియైన ప్రవృత్తి నుద్బోధించుటచేత ఈ వేదమునకు అథర్వవేదమని పేరువచ్చినది పరబ్రహ్మప్రాప్తి కిది ఋజుమార్గము నెరింగించును యజ్ఞములలో ఇది బ్రహ్మగారి వేదము. శాంతి పౌష్టిక క్రియల కిది మూలము దీనిని అథర్వాంగిరసులు దర్శించిరట. ఆ కారణమున దీనికి అథర్వాంగిరసమని వేరొక పేరు. అట్లే భృగ్వాంగిరసమనికూడ దీనిని వ్యవహరింతురు. భృగువు అంగీరసుని శిష్యుడట। గోపథ బ్రాహ్మణములో ఆ యీ పేర్లతో పాటు దీనికి బ్రహ్మవేదమను పేరుకూడ చెప్పబడినది.

వేదవ్యాసుని శిష్యులలో సుమంతు డనునాత డీ వేదము నభ్యసించెను. అతని శిష్య ప్రశిష్యులచే ప్రచారమునకు వచ్చి ఈ వేదము తొమ్మిది శాఖలుగా విస్తరించెను. కాని యీ నాడు మన కీ వేదమునకు సంబంధించినవి శౌనక, పిప్పలాదశాఖలు రెండుమాత్రమే మిగిలినవి పిప్పలాద సంహిత ఒకే ఒక ప్రతి కాశ్మీరములో లభించినది. అదికూడఅసమగ్రము, పిప్పలాదునిప్రశంస ప్రశ్నోపనిషత్తులో కనిపించును. ఈ శాఖకు ఇరువది కాండలు కలవనియును దీని బ్రాహ్మణము ఎనిమిది అధ్యాయముల గ్రంథమనియును తెలియుచున్నది. కాగా ప్రచారములోనున్నశాఖ శౌనకశాఖమాత్రమే.

శౌనక శాఖీయులైన బ్రాహ్మణులు గుజరాతు మహారాష్ట్ర ప్రాంతములలో ఉన్నట్లు తెలియుచున్నది. గోపథబ్రాహ్మణ మీ శౌనక సంహితకే సంబంధించును. శౌనక సంహిత 20 కాండలు 732 సూక్తములు 5987 మంత్రములు కలిగి మంత్రసూక్తములన్నియు ఒక నిర్ణీతమైన క్రమములో సంగ్రహించినట్లు కాన్పించును. ఇందులో 1200 వరకు ఋగ్వేద మంత్రములే తిరిగి విన్పించును. సోమయాగమునకు ఉపకరించు మంత్రము లెన్నియో దీనిలో చేర్చబడినవి. ఇరువ ది

యవకాండలో ప్రసిద్ధమైన సంతాపసూక్తము గోచరించును 'కుమం నామ కుత్సితం భవతి యత్ తత్ తపతి తస్మాత్ కుంతాపః' అని యీసూక్తము సమస్త కుత్సితాపహారకమని చెప్పబడినది యజ్ఞములలో ఈ సూక్తమును విధిగాపఠింతురు దీనిలో పరిషత్తు రాజు మున్నగువారి ప్రశంసలెన్నో వినిపించును కొందరీ వేదమును క్షత్రవేదమనికూడా పిలుతురు. సంగ్రామం శత్రుజయము రాజవారణము,అభిషేకము, దుందుభివంటి వాద్యాలప్రశంస వాటిస్తోత్రాలుమున్నగు విషయాలెన్నో క్షత్రధర్మ రాజకర్మలకు సంబంధించినవి ఈవేదములో వర్ణింపబడినవి రాష్ట్రీయ భావములెన్నోచోట్ల వెల్లడింపబడినవి పృథ్వీసూక్తములో భూదేవిని మాతృరూపములో దర్శించి తద్వాత్సల్య మాశింపబడినది,

అథర్వసంహితలో ఆరంభకాండలు తొమ్మిదింటివరకు ఎన్నో, భైషజ్యసూక్తాలతో నిండికనిపించును. వీనిలో శ్వేతకుష్ఠ పలితరోగము, శీతజ్వరము కాసశ్వాస శ్లేష్మరోగములు, బాలగ్రహపీడలు, రాజయక్ష్మవంటి మహావ్యాధులెన్నిటికో మంత్ర తంత్రౌషధ ప్రక్రియలు వర్ణింపబడినవి. దీనిలో రోగనిదానముకూడ చెప్పబడినది. జ్వరము ఋతుసంబంధియని, క్రిములు రోగవ్యాప్తికిమూలమని, సూర్యకిరణ ప్రసారమారోగ్య వర్ధకమని విషస్య విషమౌషధమ్మను నూటసత్యమని, ఓషధులతోపాటు మణులు మంత్రములుకూడ రోగాపహారులని వర్ణించిన ఆయాసూక్తములుశస్త్రచికిత్స శల్యచికిత్స దంత నేత్రనాసికాచిత్సలకు ప్రత్యేకముగా సంబంధించినవి. రోగనివారణకు వలెనేశత్రు, గ్రహ భూత, ప్రేత, పిశాచ పీడానివారణకు కూడ ఈవేదము మంత్రతంత్ర,ఆభిచారిక క్రియాకలాపం లెన్నోసూచించును

ఔషధప్రక్రియలు, అభిచారిక తంత్రములు మారణమేకాకిశాంతి పౌష్టిక క్రియలు, రక్షాసూత్రధారణాదులు, ఉపనయన చౌలాది సంస్కారములు. హలకర్మ, బీజవాపనము, వృష్టివాణిజ్యము మున్నగునవెన్నో ఈవేదములో వర్ణింపబడినవి జ్ఞాతాజ్ఞాతదోష నివృత్తికా చరింపవలసిన ప్రాయశ్చిత్తాలు, అనాటి శకునాలు, ఆచారవిశ్వాసాలు మున్నగునవెన్నో ఈ వేదమువలన తెలియను ఇంతగా ఈప్రక్రియలు వివరించినందుననే రాజపురోహితులకీ

వేదము విధిగాతెలిసి యుండవలెనని చెప్పబడినది. దేశశాంతికి, రాష్ట్రరక్షణకు, రాజ్యాభివృద్ధికి రాజహితమునకు వలసినశాంతి, పౌష్టికక్రియలు యథావిధిగా నిర్వహింపదగిన వాడేరాజ పురోహితుడుగా నుండదగుననిదీనిభావం తదనుకూలముగనే రాష్ట్రీయత, సామ్రాజ్యనిర్మాణము, తద్రక్షణము, రాజసూయంవంటి వానిప్రశంసలెన్నో ఈవేదములో గోచరించును అట్లే ఈవేదము 12వ కాండములో పృథ్వీసూక్తమున్నది ఇదిదేశభక్తి ప్రపూర్ణమైనసూక్తం దేశము, రాష్ట్రము. సమాజము అనునవేకాక గృహము భూమి, పశుసంపద మున్నగునవికూడ ఈవేదములో సమాన ప్రాధాన్యముతో వర్ణింపబడినవి గో సూక్తములో గోవులు, వానిమహాత్మ్యము వివరింపబడినది, గోవులెల్లరకు వరణీయములని చెప్పి,

"వశామేనా మృతమాహుః వశాం మృత్యుముపాసతే ।
వశేదం సర్వమభవత్ దేవా మనుష్యా అసురాః పితరరృషయః

అని వశాగోసూక్తములో వర్ణింపబడినది.

ఇట్లే స్త్రీలనుగూర్చిచెప్పిన సూక్తములలో పతిప్రేమ పుత్రప్రాప్తి, పుత్రరక్షణము, సపత్నీవిజయము మున్నగు విషయములతోపాటు వశీకరణము మోహనము, మారణమువంటి తంత్రములుకూడ వర్ణింపబడినవి. ఈ విషయములుకొన్ని ఈనాటి నాగరికతకు రుచింపపు ఆయినా విధమైన అభిచారిక మంత్రములుండుటచేత కొందరీ వేదమార్యానార్య సంస్కృతి సమ్మేళనమునకు ఫలితముగా వికసించినదని చెప్పుదురు. మరికొందరిది రచనలో అర్వాచీనమైనను వర్ణ్యవిషములనుబట్టి ఋగ్వేదముకంటె ప్రాచీనమైన నాగరికతకు సంబంధించినదిగా చెప్పుదురు. కాని స్త్రీలను గౌరవించుటలోగాని వారికి గృహస్థాశ్రమములో తగినంత ప్రాధాన్యమిచ్చుటలోగాని ఈవేదము ఋగ్వేదమున కేమాత్రము తీసిపోదు ఆడుబిడ్డకు కన్యాధనమిచ్చి అత్తవారింటి కంపుముచేయునట్టి ఉపదేశములో —

"యథా సింధుర్నదీనాం సామ్రాజ్యం సుషవే వృషా
ఏవా త్వం సమ్రాజ్ఞ్యేధి పత్యురస్తం పరేత్యచ అని చెప్పిన

వాక్యములు 'సమ్రాజ్ఞీ శ్వశురో భవ సమ్రాజ్ఞీ శ్వశ్రువాం భవం' ఇత్యాదిగా చెప్పిన ఋగ్వేదమంత్రమును జ్ఞప్తికి తెచ్చినట్లుండును. 'సామాహమస్మి ఋక్ త్వం ద్యౌరహం పృథివీత్వం' అనివరుడు కన్యను వరించును. 'దీర్ఘాయురస్తు మే పతిర్జీవాతిశరదః శతమ్' అని వధువు ప్రార్థించును. 'ఇహేమా విన్ద్ర సంనుద చక్రవాకేవ దంపతీ' అని బంధుమిత్రులాశీర్వదింతురు, ఈ ధర్మము లేనాటివైనను నిత్యనూతనములును చిరంతన మాంగలికములును, సమాజహితాపాదకములును నగుట తథ్యము.

అథర్వవేదములో బ్రహ్మచర్యముకూడ ప్రశంసింపబడినది అది మృత్యుంజయ మనియు, అభివృద్ధిమూలక మనియు, చెప్పబడినది,

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమవాఘ్నత ।
ఇంద్రోహ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభవత్ ॥

అని దాని మాహాత్మ్య ముగ్గడింపబడినది. ఈవేదములో 8వ కాండమున మృత్యుంజయ సూక్తమును 9వ కాండమున మధుకశౌషధీ సూక్తమును గోచరించును. వివాహ సభాజయాది వివిధ విషయములతో పాటు దీనిలో ఉత్తరక్రియలకు సంబంధించిన విషయములుకూడ చెప్పబడినవి.

ఈ వేదములో నక్షత్రములను కృత్తికనుండి యారంభించి లెక్కించు పద్ధతి గోచరించును కాలమున కిందు మిక్కలి ప్రాధాన్య మీయబడినది. కాలమన్నిటికిని మూలబీజము. అదే ప్రపంచమున కధిష్ఠానము మనః ప్రాణనామములు కాలములోనే సమాహితమగునట్టివి. కాలమే ఈశ్వరుడు. ప్రజాపతికి పిత

కాలే తపః కాలే జ్యేష్ఠః కాలే బ్రహ్మ సమాహితమ్
కాలో హ సర్వస్యేశ్వరో యః పితాసీత్ ప్రజాపతే ॥

అథర్వవేదము 13వ కాండలో రోహితుని వర్ణనమున్నది, అది సూర్యునికి ప్రతీకమని చెప్పుదురు.

స్కంభ ఉచ్ఛిష్టసూక్తములలో ఈవేదము పరబ్రహ్మస్వరూపమును ప్రకారాంతరముగా చర్చించును. పరమతత్త్వమున కాధారభూతమైనదేదో

అదియేస్కంభము అది యీవిశ్వమునకేకాదు బ్రహ్మకేకారణము, అదిజ్యేష్ఠ బ్రహ్మ. భూమి, అంతరిక్షము. ఆకాశము, అగ్ని, సూర్యుడు, చంద్రుడు వాయువు అన్నియు దానిలో అంతర్భూతములు అది ఆత్మతో ఐక్యతనంది యుండు తత్త్వము, ఉచ్ఛిష్టమనగా శేషించినది దృశ్య ప్రపంచమునగల నామ రూపాత్మకతత్త్వములన్నింటిని "నేతి నేతి గా తర్కించి నిషేదించుచు పోయినచో చివరకేది శేషించునో అదిఉచ్ఛిష్టము అదియే బ్రహ్మము ఈ జగత్తు వేదపురాణములతోను ప్రాణాపానచక్షు శ్రోత్రాదులతోను కూడ ఉచ్ఛిష్టమునుండియే వెలువడును,

> యచ్చ ప్రాణతి ప్రాణేన యచ్చ పశ్యతి చక్షుషా।
> ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రిత ॥

అధ్యాత్మతత్త్వ విచారముతోపాటు ఆశ్రమచతుష్టయ వివరణముకూడ అదర్వములో నున్నది, అచ్చటచ్చట కొన్నిదార్శనిక సూక్తములు గద్యలో కూడనున్నవి. ఒకచోట సాంఖ్యయోగ వెదాంత బౌద్ధదర్శనము లన్నిటికిని మూలమనదగిన మంత్రము కాన్పించును.

> అసతి సత్ ప్రతిష్టితం సతి భూతం ప్రతిష్టితం।
> భూతం హి భవ్య అహితం భవ్యం భూతే ప్రతిష్ఠితమ్
> తదేవ విష్ణో బహుధా వీర్యాణి త్వం న సృణీ।
> పశుభిర్విశ్వరూపైః సుధాయాం మా దేహి పరమే వ్యోమన్ ॥

అథర్వవేదములోని కొన్ని సూక్తములకు వ్రాత్యసూక్తములని పేరు వ్రాత్యులనగా సంస్కారలోపమునకు గురియైన వారని అర్థము, ఆనాటి సమాజములో సంస్కారము లోపించినవారు కొందరుండిరని తాండ్యబ్రాహ్మణాదులలో అన్యత్రకనిపించు వర్ణనలు సాక్ష్యమిచ్చును, కాని నియమరాహిత్యము బ్రహ్మపదార్థమునుకూడ సూచింపగల తత్త్వము, పరబ్రహ్మ నియమాతీతుడే కనుక అతనికి సంస్కారలోపము వర్తింపదు వ్రాత్యోవా ఇదమగ్రఆసీత్ అని ప్రారంభించి సూక్తము ఋగ్వేదములోని హిరణ్యగర్భ సూక్తమును చట్టున స్ఫురణకు తెచ్చును. ఏది ఎట్లున్నను ఉపనిషద్వేదాంతమున కిదిభూమిక అనిమాత్రము తోచకమానదు కనుక వ్రాత్యశబ్దమును పరబ్రహ్మపరముగా కూడా అన్వయింపవచ్చునని కొందరిమతము.

ఋగ్వేదములోవలెనే అథర్వణ వేదములోకూడ ఎన్నో ఆదిభౌతిక విషయములు వర్ణింపబడినవి. ఇవిఆనాటి సమాజమును ఆప్పటివారి ఆచార విశ్వాసములను తెలియజేయును. దేవతా స్తోత్రములు, సౌమస్తుతులు, ద్రోణ కలశ ప్రశంసలు మున్నగునవి చూచినచో ఋగ్వేదముకూడ యజ్ఞమును తన్నిర్వహణ విధానమును మనసులో నుంచుకొని సంగ్రహించి నడిగనే కాన్పించును అట్లే అభిచార తంత్రమునుగూర్చి ప్రాకృతజనుల కుపకరించు విధముగా సంగ్రహించిన వేదము అథర్వణము కావచ్చును స్వర్గప్రాప్తి యజ్ఞఫలము. సంసారసుఖము శాంతి,పౌషికక్రియల ఫలము అథర్వములో మానసిక యజ్ఞముకూడ వివరింపబడినది, ఇది అల్పవ్యయముతో సులభ సాధ్యమునగు అధ్యాత్మిక సాధనకు ప్రక్రియ

అధర్వవేదములోని భాషాచ్ఛందాదులు దాని నర్వాచీన రచనగా నిరూపించును. అట్లేదీనిలో వర్ణించిన భౌగోళికచారిత్రక సాంస్కృతిక విష యములుకూడ దీనిని వెనుకటికాలమునకే సంబందించినదిగా చెప్పును, ఇందులోవర్ణించిన దేవతలుకూడ ప్రకృతి ప్రతీక తత్త్వములుగాకాక దుష్ట శిక్షణమును శిష్టరక్షణముచేయు పౌరాణిక దేవతలకు సన్నిహితులుగా కాన్పింతురు ఇందలి అధ్యాత్మిక వాదముకూడ ఉపనిషద్వాదమునకు చేరువ వేదమునకుగల త్రయీ అను పేరుకూడ అథర్వమును తరువాతి కాలపు రచనగానే నిరూపించును తిలక్ పండితుడు అధర్వణవేదములోని చాలా భాగములు భారతదేశమునకు వెలుపలగల దేశములలోని ఆచారవ్యవహార ములకు సంబంధించినవిగా చెప్పెను కొందరీవేదమును జరదుస్త్రా అసుర వేదమని చెప్పుదురు, 'అవెస్తా'లోని 'అధ్రవన్' అనుశబ్దము అధర్వమునకు మూలమనికొందరి మతము కాని ప్రాచీన పౌరాణికవాద మీ వాదములతో ఏకీభవింపదు అన్నివేదములు ఒకేసారి పరమేశ్వరుని ముఖమునందుద్భ వించినవనియు, ఆమీదనే సృష్టిజరిగిన దనియు సనాతనులు నమ్మెదరు. వేదసంహితను నాల్గుగా విభజించినది వ్యాసభగవానుడు. పఠినిన దాతని శిష్యచతుష్టయము. కనుక వానిపూర్వా పరత్వములుగాని ప్రాచీనార్వా చీనతలుగాని నిర్ణయించుట తగదని చెప్పుట అనూచానమైన సంప్రదాయము ఇదే సాయణుని మతము.

—:O:—

# బ్రాహ్మణములు

"మంత్రబ్రాహ్మణయోర్వేదనామధేయమ్" అని చెప్పిన దానినిబట్టి సంహితలోని మంత్రభాగమున కెంతప్రాధాన్యమో గద్యభాగమైన బ్రాహ్మణములకును అంతేప్రాధాన్యమని గ్రహింపవలెను, బ్రాహ్మణములు గద్యాత్మకములు యజుర్వేదములో సంహితలోనే మంత్రబ్రాహ్మణములు రెండును కలిసియుండును. కాని తక్కినవేదములలో మంత్రభాగములు సంహితగా నేర్పడి, బ్రాహ్మణములు విడిగా నేర్పడినట్లుండును,

బ్రహ్మనుగూర్చి వ్యాఖ్యానించునవి బ్రాహ్మణములు బ్రహ్మపదమునకు మంత్రమనియు యజ్ఞమనియు అర్థములున్నవి. కనుక మంత్రార్థములను యజ్ఞవిధులను వివరించి చెప్పునవి బ్రాహ్మణములని, బ్రాహ్మణం నామకర్మణ స్తన్మంత్రాణాం వ్యాఖ్యానగ్రంథః అని నిర్వచింపబడెను అని మంత్రార్థవివరణము వినియోగము, ప్రయోజనము, ప్రతిష్ఠానము అందుకు వలసిన విధులు బ్రాహ్మణముల వలన తెలియదగునని వివరించుచు

నైరుక్తం యస్య మంత్రస్య వినియోగః ప్రయోజనమ్ !
ప్రతిష్ఠానం విధిశ్చైవ బ్రాహ్మణం తదిహోచ్యతే ॥

అని వాచస్పతి మిశ్రవ్రాసెను. బ్రాహ్మణసదృశమో లేకతదవాంతర భాగమో అయినదానిని 'అనుబ్రాహ్మణము' అని వ్యవహరింతురు. మంత్ర వినియోగాదులున్న వానిని కర్మబ్రాహ్మణములనియు, కేవల మంత్రసంకలనమున్నవానిని కల్పబ్రాహ్మణములనియు పిలుతురు.

బ్రాహ్మణములలో విధి అర్థవాదము, ఉపనిషత్తు అను మూడు భాగములు, విధిలో ఆయా యజ్ఞములు ఎట్లు, ఎవరు, ఏవిధముగా ఆచరింపవలెనో తెల్పునట్టి విధాయకవాక్యములు చేరును. వాటిని సోపపత్తికముగా నిరూపించుటకు చెప్పిన వాక్యాదులన్నియు అర్థవాదముక్రింద గ్రహింపబడును. తత్త్వవిచారమునకు సంబంధించిన వాక్యములు ఉపనిషద్భాగమున గ్రహింపబడును, వీనిలో విధిముఖ్యము, తక్కినవి గౌణము

హేతునిర్వచనం నిందా ప్రశంసా సంశయో విధిః
పరిక్రియా పురాకల్పో వ్యవధారణ కల్పనా !
ఉపమానం దశైతే తు విధయో బ్రాహ్మణస్యతు ॥

అని శాబరభాష్యము (2-1-8) లో బ్రాహ్మణముల లక్షణము మరి కొంత వివరముగా చెప్పబడెను. ఏ క్రియ ఎందు కాచరింపవలెనో తెలుపునది హేతువు. శబ్దార్థమును స్పష్టపరచునది నిర్వచనము. యాగోపయోగి వస్తువులను గూర్చి, విధి విధానములను గూర్చి, సయుక్తికముగా సచ్చెప్పుటకై వలసిన ప్రక్రియలు నిందా ప్రశంసాదులు. దీనిలో కథలు, కల్పనలు, ఉపమానాలు ఊహలు, మున్నగునవన్నీ ఉపయోగ పడునట్టివే. వీనినే అర్థవాదాలని పేర్కొందురు.

బ్రాహ్మణములు గద్యలో ఉన్నను మంత్రములవలె ఇవికూడ స్వరయుక్తములు. ఇవి సరళమైన భాషలో చిన్న చిన్న వాక్యములుగా నుండును. వైదిక లౌకిక సంస్కృతభాషల కిది మధ్యకాలపుభాషాశైలి యని పండితులు చెప్పుదురు. సంహితలో మృగశీర్షాదిగానున్న నక్షత్రగణన బ్రాహ్మణములలో కృత్తికాదిగా కనిపించును. శతపథద్వితీయకాండలో కృత్తిక సరిగా తూర్పున ఉదయించినట్లున్న వర్ణనచూచి నేటికది 3000 ఏండ్లనాటి రచనయని వింటర్‌నిజ్ పండితుడు లెక్కించెను. కాని మైత్రీ ఉపనిషత్తు ననుసరించి ఇవి యింకను వేయేండ్లు వెనుకకు చెందునని మరికొందరి వాదము.

బ్రాహ్మణములలో కురుపాంచాల దేశములు వర్ణింపబడినవి. సరస్వతీనది వినశన మను చోట అంతర్వాహినిగా మారి, తిరిగి పక్షప్రస్రవణ మను చోట ఉద్గమించినట్లు వ్రాయబడినది. యమునా ప్రవాహభూమి, సరస్వతీ దృషద్వతీ నదుల సంగమస్థానము నిర్దేశింపబడినవి. ఈ ప్రదేశమునే మనువు బ్రహ్మావర్తమని పిల్చెను. ఇది ధర్మానికి నెలవని ఇతరుల కాదర్శమని చెప్పుచు

ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥

అని వ్రాసెను. కురుక్షేత్రములో ప్రజాపతి యజ్ఞ వేది నిర్మించెను. ఎందరో ఋషులు యజ్ఞయాగము లాచరించిరి. భారతయుద్ధ మాచోట ప్రవర్తిల్లెను. ఈ మండలానికి చెందిన భాష ఉదీచ్యభాష అనీ అవి మిక్కిలి ప్రశస్తమనీ శాంఖాయన బ్రాహ్మణములో చెప్పబడెను.

ఋగ్వేదమునకు చెందిన బ్రాహ్మణములలో ఐతరేయము ప్రసిద్ధము ఇది మహిదాసకృతము. 'జెంద్ అవెస్తా'లో ఋత్విజునికి 'ఏద్రేయ' అని పేరు. అదే ఐతరేయశబ్దమునకు మూలమేమో అని కొందరి అనుమానము. ఇందులో 40 అధ్యాయముల గ్రంథము 8 పంచికలు 285 కండికలుగా విభజింపబడినది. అంతటా హోతృకార్యకలాపములే ఎక్కువగా వర్ణింపబడినవి. అగ్నిష్టోమ, ఉక్థ, అతిరాత్రి, రాజసూయాది యజ్ఞములెన్నో వివరింపబడినవి ఇంద్రమహాభిషేక, సామ్రాజ్యాభిషేకములుకూడ వర్ణింపబడినవి. దీనికిసాయన భాష్యమేకాక మరి రెండు భాష్యములుకూడ దొరుకుచున్నవి. ఋగ్వేదీయ శాంఖాయన బ్రాహ్మణముకూడ 36 అధ్యాయముల బృహద్గ్రంథము. కౌషీతకిలోకూడ ఎన్నో సోమయాగములు చెప్పబడినవి. సాంఖ్యాయన శ్రౌతసూత్రములో పురుష మేధాదులు ప్రతీకాత్మకములుగా వివరింపబడినవి.

బ్రాహ్మణములలో యజ్ఞయాగాదుల వివరణముతోపాటు ప్రాసంగికములైన కథలు, దేశకాలాదుల చర్చలు మున్నగునవికూడ గోచరించును. ఐతరేయములో నొకచోట ఋగ్యజుస్సామములు మూడును వాణి అనియు, అథర్వము మనస్సనియు వర్ణింపబడెను సౌవర్ణ సూక్తములను ప్రశంసించుచు గాయత్రి పక్షిరూపమున నేగి సోమరసము తెచ్చినట్లు చెప్పబడెను. ఇదే బ్రాహ్మణములో శునశ్శేపునికథ విస్తారముగా వినిపించును ఈ కథలోనే ఆంధ్రులు విశ్వామిత్ర సంతతిగా, వింధ్యకు దక్షిణముగా వలసవచ్చినవారగా వర్ణింపబడిరి అట్లే హరిశ్చంద్రుడు, జనమేజయుడు, శర్యాతి, సుదాసుడు, భరతుడు మున్నగువారి కథలతోపాటు విదేహ, దక్షిణమున గల భోజ సాత్వత యాదవ) రాజ్యములు పశ్చిమమునగల నీచ్య అపాచ్య రాజ్యములు, ఉత్తరమున కురుమద్ర రాజ్యములు కూడ దీనిలో వర్ణింపబడినవి.

శుక్ల యజుర్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణములలో, శతపథము మిక్కిలి ప్రసిద్ధము. ఇందనేక యాగములు, అగ్నిరహస్యము, విష్ణుక్రమము, శతరుద్రీయము, ఉపనయనస్వాధ్యాయ సర్వమేధాదులు. ద్వాదశాహ క్రతువులు, షాణ్మాస సత్రములు, సౌత్రామణివంటి పరయాగములు మున్నగునవెన్నో వర్ణింపబడినవి. యజ్ఞమునకు ఆధ్యాత్మిక వ్యాఖ్యాన మొసగి,

అంతర్యాగ బహిర్యాగములకు సామరస్యము విధించబడినది. ఈబ్రాహ్మణములోని స్వరాంకనపద్ధతిని ఉచ్చారణ విశేషములనుబట్టి ఇది అన్నిటికంటె ప్రాచీనమైన బ్రాహ్మణమని పండితులు నిర్ణయించిరి. ఇందులో దుష్యంతుడు, భరతుడు, ఉద్దాలకుడు, అరుణిమున్నగు వారి కథలతోపాటు ప్రాచీన జలప్రళయమును, మత్స్యావతారమును, వైవస్వతమనువు చరిత్రమును విస్తారముగా వర్ణింపబడినవి. వేరొకచోట విదేహ మాధవుడు తనపురోహితుడైన గౌతమరాహుగణునితో గండకీనదిదాటి తూర్పుగావలస వెళ్ళినట్లు చెప్పబడెను

ఈ బ్రాహ్మణములో త్రయీ మంత్రములసంఖ్య 24వేలుగాలెక్కింపబడెను. ప్రతినాల్గువ ఏటను 21రోజులు సంవత్సర పూర్తికిగాను చేర్చవలెననియు, ఆసంవత్సరము అశ్వమేధ మొనర్చవలెననియు చెప్పబడెను శతపథబ్రాహ్మణమునే వాజసనేయమనికూడ పేర్కొందురు దీనిలో 14వ కాండ అరణ్యకము.

కృష్ణయజుర్వేద బ్రాహ్మణములలో తైత్తిరీయము ప్రధానము. ఇది స్వరయుక్తము, ఇది మూడుకాండలుగా 12అధ్యాయము (ప్రపాఠకము)లు గల గ్రంథము. ఈఅధ్యాయములు తిరిగి కొన్ని అనువాకములుగా విభజింపబడినవి ఇందులో వైశ్యసృజయజ్ఞము వివరింపబడినది, అశ్వమేధము క్షత్రియులే ఆచరింపదగునని నిర్ణయింపబడినది. రాజపుత్రులు ఉగ్రులు, క్షత్రియులు అనిరాచరికమునుబట్టి రెండువిధములుగా చెప్పబడిరి. కాలకంజాసురునికథ, వరాహావతారకథ, సోమ, శ్రద్ధా, సీతా, సావిత్రిమున్నగు వారి వివాహకథలు దీనిలో వర్ణింపబడినవి ఒకచోట దీర్ఘరాత్రులు పేర్కొనబడినవి,

సామవేదానికిచెందిన బ్రాహ్మణములలో తాండ్యబ్రాహ్మణము చాలా ప్రసిద్ధము, ఇది 40 అధ్యాయముల గ్రంథము, దీనిలో మొదటి 25అధ్యాయములు పంచవింశబ్రాహ్మణమనియు, ఆమీది 5 అధ్యాయములుషడ్వింశబ్రాహ్మణమనియు, ఆపైని రెండు అధ్యాయములు మంత్రబ్రాహ్మణమనియు చివరి ఎనిమిది అధ్యాయములు ఛాందోగ్య బ్రాహ్మణమనియు వ్యవహరింపబడును, ఛాందోగ్యబ్రాహ్మణమే ఛాందోగ్యోపనిషత్తు దీనిలోఒకభాగమునకు

దేవతాధ్యాయమని పేరు. ఆకారణమున అభాగమునకు దైవత బ్రాహ్మణమని పేరువచ్చినది. తాండ్యబ్రాహ్మణము తండిఋషినిర్మితము. దీనిలో ఎన్నో సోమయాగములు వివరింపబడినవి. ఇవన్నీ శ్రౌతయజ్ఞములు. ఈ బ్రాహ్మణములోకూడ సరస్వతీ దృషద్వతీ నదులప్రదేశము కురుక్షేత్రము, నైమిశారణ్యము, అచ్చటియజ్ఞము, వ్రాత్యస్తోమము, అనేక ప్రాయశ్చిత్తములు పేర్కొనబడినవి. ఇందులోకొన్ని ఏకాహయజ్ఞములు, మూడువర్ణములవారు కలసి నిర్వహింపదగిన అహీనయాగములు గూడవర్ణింపబడినవి. గ్రంథ విస్తృతినిబట్టి దీనికి మహాబ్రాహ్మణమని పేరు

సామవేదీయములైన ఆర్షేయ, వంశ, సంహితోపనిషత్, సామవిధాన జైమినీ బ్రాహ్మణముల కూడ సోమయాగములను. సామవిధానమును, సామ. వేదీయ ఋష్యానుక్రమణికలను వివరించును. జైమినీబ్రాహ్మణమునే తలపకిర బ్రాహ్మణమనికూడ పేర్కొందురు ఈబ్రాహ్మణము పూర్తిగాదొరకలేదు దీనిలో ఒకభాగమైన ఉపనిషద్బ్రాహ్మణమునే గుయ్యత్రుపనిషత్తని వ్యవహరింతురు.

అథర్వణవేదమునకు చెందిన గోపథ బ్రాహ్మణము పూర్వోత్తరభాగములుగా లభించుచున్నది. పూర్వభాగమున అయిదు, ఉత్తరభాగమున 6 ప్రపాఠకములున్నవి దీనిలో ఒంకారము, గాయత్రి, బ్రహ్మచారినియమంలు ఋత్విక్కుల కార్యకలాపములు, దీక్ష, సంవత్సరసత్రములు మున్నగు విషయములెన్నో వర్ణింపబడినవి ఎన్నోశబ్దములు నిర్వచింపబడినవి ఒకచోట బ్రాహ్మణులకు నృత్యగానములు నిషిద్ధములని చెప్పబడినది.

బ్రాహ్మణములలో యజ్ఞయాగములే ప్రధానముగా వర్ణింపబడిన విషయము అది యజ్ఞయాగములకు చెందినయుగము యజ్ఞోవైశ్రేష్ఠతమం కర్మ అని ఆనాటివారి విశ్వాసము. యజమేబ్రహ్మ. అదియే ప్రజాపతి,అతడే పరమాత్మ అగ్నిహోత్రము నుండి అశ్వమేధము వరకుగల యజ్ఞములన్నియు తదారాధనలే, దేవతలు పరంపరయా ప్రజాపతి స్వరూపాలు, ప్రజలు వృష్టికాములై యజింతురు, యజ్ఞమువలన ధూమము, దానివలన మేఘము తదుపరి విద్యుత్తుసంభవించి అన్నాదులు లభించును. మరుత్తులు పర్జాదిదేవతలు నిత్యాగ్ని హోత్రులు సమస్త పాపముల నుండి విముక్తులగుదురు.

ప్రజాపతి నిత్యుడు, అమృతస్వరూపుడు అతడే యీ సృష్టికాద్యుడు అతని సంకల్పమేసృష్టి మనసావరేణ్యుడైన యాతని తత్త్వమెరిగినవారు ముక్తులు

యజ్ఞములో 7గృహ్యాగ్నికిని 14శ్రౌతాగ్నికిని సంబంధించినవి, పుత్రేష్టి, రాజసూయాదులు ప్రత్యేకములు. యజ్ఞబలిబహుదా అనుకల్పరవితము, వనస్పతులకు యాజ్ఞియములని పేరు. మానవకల్యాణము,విశ్వశాంతి యజ్ఞమునకు ప్రదానలక్ష్యములు.

బ్రాహ్మణములలో దేవతలు హవిర్భుజులనియు, సంఖ్యకు 32 గురు అనియు, ఇంద్రుడు దేవాధిపతిఅనియు చెప్పబడినది, పరోక్ష ప్రియాహి దేవాః ప్రత్యక్షద్విషః అనిపదేపదే పేర్కొనబడినది, ఐతరేయములో రుద్రోవైజ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ దేవానాం అనిచెప్పి శివ,భవ, పశుపతి, ఉగ్ర, మహాదేవ, రుద్ర, ఈసాన నామములు నిర్వచింపబడినవి. అట్లే అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమః అని విష్ణుపారమ్య మంగీకరింపబడినది.

బ్రాహ్మణములు విద్యాంసులను 'విద్వాంసోహిదేవాః' అనిగౌరవించును బ్రాహ్మణులు మనుష్యదేవులనియు, వారికి సోముడు రాజనియు, నిష్ఠాధ్యయవాదులు వారికి తేజస్సు కూర్చునవనియు వర్ణించును, బ్రాహ్మణులు యజ్ఞదక్షిణలందుకొందురు అతిమానము పరాభవమునకుమూలము సత్యము వేదము, అదేవిద్య.

బ్రాహ్మణముల ననుసరించి సంవత్సమునకు 360 దినములు, మానవ శరీరమునగల ఎముకలు 360, మానవాయుర్దాయ పరిమితి 100 ఎండ్లు ఋతుసంధులలో వ్యాధులుద్భవించును. అగ్నిరదోగణముల నపహరించును హిరణ్యము దీర్ఘాయువు నిచ్చును

దేవ, ఋషి, పితౄణములనుండి విముక్తుడగుటకై పురుషుడు ప్రేమ పూర్వకముగా వివాహమాడవలెను భార్య పరమసఖునివంటిది, అర్ధాంగి అపత్నీకుడు అగ్నిహోత్ర మాచరింపకూడదు. అపుత్రకునికి సద్గతిలేదు.

బ్రాహ్మణములు నీతికి ప్రాధాన్యమిచ్చును. సత్యము నుత్కృష్టధర్మముగాచెప్పును, ఒకపాప మింకొకపాపమునకు దారితీయునని హెచ్చరించును

కర్మాచరణమున శ్రద్ధాళువులై యుండుడని ఉపదేశించును. అతిథ్యమత్తము ధర్మమనిచెప్పును.

బ్రాహ్మణములలో స్త్రీలు లక్ష్మీస్వరూపలుగా మంగళదాయినులుగా వర్ణింపబడిరి, స్త్రీలను హింసింపరాదని చెప్పబడినది, ప్రాతివ్రత్యము, వీర మాతృత్వము స్త్రీలకాదర్శములు,

బ్రాహ్మణముల ననుసరించి సగోత్రీకులైనచో వివర్ణులైనచో ఏకవాస మునకర్హులు. వ్రాత్యులు తలపాగ, ములుగోల, చేతికర్ర, గూడులేనిబండి వెండినాణెములు దక్షిణలుగా గ్రహించుచుండిరి. ఋత్విజులు నిర్రపాగాలు ఎర్రంచుదోవతులు ధరించుచుండిరి. బ్రాహ్మణములో ఈ విధమైన వర్ణ ధర్మములతో పాటు ఆనాటి జ్యోతిష, రేఖాగణిత, ఆయుర్వేదాది విద్యలకు సంబంధించిన విషయములెన్నో ప్రసంగ ప్రాప్తముగా వర్ణింపబడినవి.

## ఆరణ్యకములు

వానప్రస్థుల యజ్ఞయాగాది విధానమును వర్ణించువేదవిభాగమునకు ఆరణ్యకమని పేరు. ఇది ఆరణ్యములో చదువదగినదని చెప్పుచు అరణ్య ఏవపాఠయిత్వా దారణ్యక మితీర్యతే' అని బోదాయనుడు దీనిని బ్రాహ్మణ మునియే నిరూపించెను. కాని బ్రాహ్మణములో గృహస్థులధర్మాలు, అరణ్య కములో వానప్రస్థులధర్మాలు వింగడించి వేర్వేరుగా చెప్పినట్లుండును, సాయణుడుకూడ దీనిని అరణ్యాలలో అరణ్యవాసులైన మునులచే దనియే నిర్వచించెను.

> అరణ్యాధ్యయనాది తద్ అరణ్యక మితీర్యతే ;
> అరణ్యే తదధీయాతే  య్యవం వాక్యం ప్రవక్ష్యతే ॥

సన్యాశ్రమస్థులు చేయదగిన మహావ్రతము, హెూత్రము వంటియజ్ఞము లెన్నో ఆరణ్యకములలో వివరింపబడినవి. వీనిలో యజ్ఞాచరణ విధానము స్వల్పముగాను, దానిని గురించిన తత్త్వమీమాంస అధికముగాను గోచరిం చును. యజ్ఞమునకు ఆదిదైవిక, అధ్యాత్మిక వాఖ్యాలు ప్రదర్శింపబడును. ఐతరేయారణ్యకము (3-2-3-12)లో ఋగ్వేదులు" మహత్సత్తాను ఉక్థ ద్వారా ఉపాసింతురు. యజుర్వేదులు దానినే యజ్ఞముచేత నర్చింతురు.

సామవేదులు మహావ్రతయోగముచే దానినారాధింతురు" అని చెప్పబడినది. అట్లేతైత్తిరీయారణ్యకములో ఆరంభముననే కాలమునకు గల పారమార్థిక వ్యావహారికరూపములు చర్చింపబడినవి. కాలము మహానదివంటిది.

నదీవ ప్రభావాత్ కాచిత్ అక్షయ్యాత్ యథా ।
తాం నద్యోభిసమాయాంతి సోమః సతీ న నివర్తతే ॥

ఇందులో ఋతువులు వర్ణింపబడినవి. వర్షఋతువులో రోగములు ప్రకోపించునని, కామెర్ల రోగికి అన్నివస్తువులు పసుపుపచ్చగా కనిపించునని వర్ణింపబడినది. పుణ్యార్జన, పాపవర్జన ప్రశంసింపబడినవి. పంచమహాయజ్ఞములు ప్రస్తావింపబడినవి వర్ణాశ్రమధర్మములు విస్తరించి వర్ణింపబడినవి.

అరణ్యకములో ప్రాణవిద్య ప్రతిపాదింపబడినది దీనికిప్రమాణముగా ఋగ్వేదమంత్రభాగము లుదాహరింపబడినవి 'ప్రాణము' 'గోప' శబ్దంచే వ్యవహరింపబడెను 'సర్వం హీదం ప్రాణేనావృతం అనిప్రాణము సర్వత్ర వ్యాపించియుండునని చెప్పబడెను. దినము ప్రాణరూపమనీ, రాత్రి అపాన రూపమనీ వర్ణింపబడెను ఉదయకాలమున ప్రాణము ఇంద్రియములను శరీరములో వ్యాపింపజేయును అది ప్రతనము ఆకారణమున దానికి ప్రాతః కాలమని పేరు, సాయంకాలమున అది ఇంద్రియములను తిరిగి సంకోచింపజేయును అది సమాగమము. కనుకనే దానికి సాయంకాలమని పేరు ప్రాణం దేవాత్మకము హిరణ్యపదనుడను ఋషి ఈ ప్రాణవిద్యను దర్శించెను. ప్రాణమే ఋషిరూపము గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజాదు లందరను ప్రాణస్వరూపులే 'ఆట్లే సర్వాఋచ ఇత్యేవ విద్యాత్' అని సమస్తమును ప్రాణస్వరూపమే అని నిశ్చయింపబడెను.

వేర్వేరు వేదములకు వేర్వేరు అరణ్యకములున్నవి, నేడుఆయా వేదములకు సంబంధించిన అరణ్యకములు ఏడుమాత్రమే లభ్యమగుచున్నవి, ఋగ్వేదమునకు చెందిన ఐతరేయారణ్యకము మిక్కిలి ప్రసిద్ధము. ఇది 5 భాగములుగా 18 అధ్యాయములుగల గ్రంథము, తిరిగి దీనిని కొన్నిఖండములుగా విభజించిరి ఇందులో మొదట మహావ్రతయాగము వివరింపబడినది ఇది గవామయనసత్రములో మొదటి దినమున నాచరించు యాగం

ఆమీద ఉక్థ, నిష్కైవల్యశస్త్ర, ప్రాణవిద్యా, పురుషవివేచనాదులు వర్ణింపబడినవి పిమ్మట నిర్భుజ(సంహిత) ప్రతృణ(పదపాఠ), సంహితల భేదము సంధి, స్వర, స్పర్శ, ఊష్మవర్ణముల భేదము వివరింపబడినది. ఈ భాగమునకు 'సంహితోపనిషత్' అని పేరు. దీనిలో కొందరు ఋషికలుకూడ పేర్కొనబడిరి తర్వాతిభాగములో మహావ్రతములో అయిదవనాడు ఉపయోగపడునట్టి మహానామ్నీఋక్కులు సంగ్రహింపబడినవి నిష్కైవల్యశస్త్రము (మహావ్రతోపయోగిమంత్రభాగము) చివరి అధ్యాయమున వర్ణింపబడినది. ఈ అరణ్యకములోని మొదటి మూడు భాగములకు ఇతరాపుత్ర ఐతరేయమహిదాసుడును, నాల్గవదానికి అశ్వలాయనుడును, అయిదవ భాగమునకు శౌనకుడును ఋషులుగా చెప్పబడిరి

కౌషీతకి(శాంఖాయన) అరణ్యకము 15 అధ్యాయములతో అనేక ఖండంలు విభజింపబడిన గ్రంథము దీనిలో 3నుండి 6 వరకుగల అధ్యాయములు 'కౌషీతకి ఉపనిషత్తు అని పిల్వబడును ఈ అరణ్యకములో బృహదారణ్యకంలోని భాగములెన్నియో ఉదాహరింపబడినవి దీనిలో జనశ్శ్రుతుడు, అహల్యా ఉశీనరాదుల కథలు, ఖాండవము, కురుక్షేత్రము, కాశీ మత్స్య, పాంచాల విదేహాదుల ప్రస్తావనలు గోచరించును.

యజుర్వేదమునకు సంబంధించిన అరణ్యకములలో తైత్తిరీయారణ్యకము కృష్ణయజుస్సునకును బృహదారణ్యకము శుక్లయజుస్సునకు చెందినవి ఇవిమిక్కిలి ప్రసిద్ధములు తైత్తిరీయారణ్యకము తైత్తిరీయ బ్రాహ్మణములోని అంతిమభాగము ఇది 10 భాగములు 170 అనువాకములుగల గ్రంథము దీ లో 7నుండి 9వరకుగల భాగములకే తైత్తిరీయోపనిషత్తని పేరు 10వ భాగమునకు నారాయణీయోపనిషత్తని వ్యవహారము. ఈ అరణ్యకములో కూడ కాశీ పాంచాల మత్స్య కురుక్షేత్రాదుల ప్రశంసలు, కశ్యప పారాశర్య వ్యాసజతుకర్ణీ శ్రమణాదుల ప్రసంగములు, సంవత్సరము గోచరించును. దీనిలో అగ్నివిద్య, స్వాధ్యాయయజ్ఞము, పంచమహాయజ్ఞములు చాతుర్హోత్రచితి, ప్రవర్గ్యయాగము, అభిచారహోమములు, రౌద్రప్రయోగములు కూడ వర్ణింపబడినవి సహగమన మాచరింపబోవు స్త్రీని వలదని వారించుచు పతి ధనుర్బాణాదులు మాత్రము గ్రహించి, చితినివిడిచి రావలసినదని చెప్పిన ప్రసంగ, మొకచోట కాన్పించును [illegible]టే యజ్ఞోపవీతము ధరించి చేసిన దంత యజ్ఞమనియే పేరొకచోట నిర్వచింపబడెను.

"ప్రసృతో హవై యజ్ఞోపవీతినో యజ్ఞః యత్కించ
బ్రాహ్మణో యజ్ఞోపవీత్యధీతే యజత ఏవ తత్ ॥

ఇంకొకచోట నీరు నాల్గువిధములని చెప్పబడెను, "చత్వారి వా అపాం రూపాణి, మేఘో, విద్యుత్, స్తనయిత్నుర్వృష్టి" అని మేఘము, మెరుపు, ఉరుము, వర్షము అనునవి నీటిభేదములుగా చెప్పి, ఆమీద కూప తటాక ప్రవాహపాత్ర నదీజలాదులుకూడ వేర్వేర వర్ణింపబడెను.

తైత్తిరీయమున నారాయణీయాదులు ఖిలకాండగా పరిగణింపబడినవి, ఈ అరణ్యకములోని అను వాక్యసంఖ్య కూడ కర్ణాట, ద్రావిడ, ఆంధ్ర, తదితర దేశములలో భిన్నభిన్నమిగా గోచరించును సాయణుడు ఆంధ్ర పాఠము ననుసరించి వీనిలో 80 అనువాకములు మాత్రమే స్వీకరించెను.

మైత్రాయణీ అరణ్యకముకూడ కృష్ణయజుస్సంబంధియే, దీనికి బృహదారణ్యకమనికూడ మారుపేరున్నది. దీనిలోకూడ అగ్నివిద్యాదులు వర్ణింపబడినవి,

శుక్లయజుస్సబంది శతపథములో మాధ్యందిన, కాణ్వబృహదారణ్యకములు రెండు గోచరించును, రెండిటిలోనూ ఉపనిషద్భాగములు కలిసియే యున్నవి. కనుకనే వీనిని బృహదారణ్యకోపనిషత్తని వ్యవహరింతురు, రెంటిలోను యాజ్ఞవల్క్యునికథ వర్ణింపబడినది, రెండును సన్న్యాసవిధానంను

సామవేదమునకు చెందిన అరణ్యకములతో తలవకార అరణ్యకము మిక్కిలి ప్రసిద్ధము దీనిని జైమినీయ ఉపనిషద్బ్రాహ్మణమనియు, తలవకారోపనిషత్తనియుకూడ పిలిచెదరు. కేనోపనిషత్తు దీని అవాంతరభాగము, సామవేదీయ ఛాందోగ్యారణకము కూడ లభ్యమగుచున్నది,

అథర్వవేదమునకు చెందిన అరణ్యకమేదియు మనకు మిగులలేదు.



# ఆలయాలు

భారతదేశం, ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరుజిల్లా ఎంతో ప్రసిద్ధిగాంచిన పుణ్యభూమి. ఈభూమిని వేదభూమిగా కూడచెప్పవచ్చును. ఈజిల్లాలోపలు ప్రాంతాలలో ప్రాచీన దేవాలయాలు ఎన్నో నిర్మించబడినవి. ఇవిఅన్నియు చోళరాజులకాలం నాటివేనని చరిత్రలు ఋజువుచేస్తున్నాయి కొన్నిప్రాంతా లలో జమిందారులు రెడ్డిరాజులు వంశపారంపర్యంగా దేవాలయ ఆలన పాలనలు చూచుకొంటూ వైష్ణవ, శైవపద్ధతుల్లో పూజాకార్యక్రమాలు నిర్వ హించడం జరుగుచున్నది. జిల్లాలో అనేకగ్రామాలలో వైష్ణవాలయాలు శైవఆలయాలు విరివిగా వెలకొల్పబడినవి

ముఖ్యముగాజిల్లాలో హెచ్చుభాగం ప్రతిగ్రామంలోను రామాలయం లేని ఊరులేదు పల్లెలేదు వీధిలేదు, ఈఆలయాలు భజన మందిరములుగా వెలసివున్నాయి, ఈఆలయాలు అన్నివర్ణాలువారు (కులాలు)తమగ్రామాల్లో నిర్మించుకొని ప్రతియేడు ఉత్సవాలు వేడుకలు జరుపుకొంటుంటారు ఐదు శనివారాలు ఉపవాసాలుచేస్తూ 3-5వారాలలో తమకు అనుకూలమైన శని వారంలో ఉత్సవాలు వేడుకలు జరుపుకొంటుంటారు,

అట్లే శివాలయాలు అక్కడక్కడవున్నాయి, ఇక్కడకూడ ప్రతియేట ఆచారపూరకముగా రాత్రిల్లో జాగారాలు ఉత్సవాలు వేడుకలు జరగడం విశేషం ప్రత్యేకించి గ్రామవేడుకలు కూడా రామాలయాలవలె ప్రతిగ్రామం లోను గ్రామదేవతలును వెలకొల్పబడి ప్రతి శుక్ర-మంగళవారాలలో స్త్రీలు అధికంగా అమ్మవార్లకు పొంగళ్ళు, పూజలుచేయడం విధిగాపాటించి చేస్తుం టారు, ఇవన్నియూ హిందుమతాచార విశ్వాసాలకు నిదర్శనం,

మానవుడు సృష్టించుకొన్న ఆచారాలు మానవునచేతనే ఆచరించ బడడానికి కారణం మనిషిలోని భక్తిమూలం విశ్వాసం తాము ఆశించిన దానిని సాధించుకోవడానికి విశ్వాసంతో ఒకగురినిపెట్టి అంటే ఒకేదానిపై మనసును కేంద్రీకరించి దాని ఫలితాలు పొందడానికి విశ్వాసంతో కొలవడం ఒక పెద్ద ఆచారంగా ఆ ఆచారము తమకు అనుకూలించే విధంగా విశ్వసిం చడం మానవుడు పొందే అనుభూతికి ప్రతిఫలంగా చూస్తున్నాము,

ధర్మంవున్నచోట దేవతున్నాడని నమ్మేస్థితి ఈనాటికి సమాజంలో కొంది ఆయొక్కధర్మాన్ని పాటించేస్థాయికి రావడానికి తమలోని విశ్వాస బలంకారణం దేవుడున్నాడని నమ్మేవాళ్ళున్నారు, లేదనినమ్మేవాళ్ళు లేక పోలేదు కాని ఆదేవుడు ప్రతియొక్క హృదయంలోనువున్నాడు, మానవ శరీరం దేవాలయం అయితే అందులోవుండే మనసేదేవుడనే విశ్వాసం నమ్మకం వుండబడే మానవుడు తనసృష్టిచేత కంటికికనబడేటట్లు, రాతిని. బొమ్మనుచేసి పూజించడం. చిత్రాన్నిచేసి పూజించడం అలవాటు చేసు కొన్నాడు ఆఅలవాటే నేడు ప్రతిచోట పూజతో పూజించే స్థాయివచ్చింది.

ఈనాడు చిత్తూరుజిల్లా దేవాలయాలకు నిలయమైన పుణ్యభూమి, వేద భూమి యాగభూమిగా.-గతంలోను భవిషతులోను చరిత్రలో స్థిరస్థాయిగా నిలచిపోయేవిధంగా అభివృద్ధిగాంచుచున్నది, దీనిని అనేకవిధాలుగా చెప్పుకో దగ్గది హిందూ దేవాలయాలతోకూడా అన్నిమతాలకు చెందిన దేవాలయాలు ఆదేవాలయాలు వ్యక్తులుపొందిన సిద్ధిచేకల్గిన మహాత్యాలుగల దేవాలయ నిర్మాణాలుకూడా జరుగుచున్నవి వాటిలో చెప్పుకోతగ్గ షిరిడిసాయి దేవాల యాలు అనిచెప్పవచ్చును. ఇవిఅన్నియుభక్తి, విశ్వాసానికి మూలము,

ప్రతిమానవుడు భక్తి, విశ్వాసానితోనే తనజీవిత మనుగడను రూపు దిద్దుకొని ప్రశాంతతను పొందడానికి తనజీవితంలో అధిక ప్రాధాన్యతను యిస్తున్నాడు మానవునికి ఇదెవిశ్వాసం భక్తుడు ముక్తిమార్గం ఏర్పడుతుంద నేది సంపూర్ణంగా నమ్ముతున్నాడు ఏకులం-మతంవారైన తాముసమ్మిన దానిని పట్టువదలక కొలచి పూజించి సంతృప్తి పడుతున్నాడు కష్టాలలోనే దేవుడుని స్మరిస్తారనే నానుడివుంది. కష్టాలకు మూలం దేవుడేనన్న నగ్న సత్యాన్నిమరువరాదు, ఇదిమనిషిచేసుకొన్న దర్మఫలితాలను బట్టివుంటుంది

అందుకే తల్లి తండ్రి, గురువు దైవము అనిచెప్పడం అందరు ఎరిగి నదే కానివీటన్నిటి విశ్వంచేదికూడ తల్లి ,తండ్రి గురువు ముగ్గురు దైవంలో సరిపోతారు, అందుకే దైవానికి అందరూదాసులే అందుకే దైవప్రార్థన మందిరాలు అవసరమైనవి అదృష్టితోనే మానవ సృష్టితోమానవునిచేసృష్టిం చుకొన్న నిలయాలు జిల్లాలో ఆలయాలుగా అందరిఆత్మలు భక్తిప్రపక్తులతో ముక్తిమార్గానికి వైకుంఠనిలయాలుగా వెలసివున్నాయి. ఇదిజిల్లా తీసుకొన్న

పుణ్యఫలితం ఆఫలితాన్ని పొందడానికే దేశం రాష్ట్రం నలుమూలల నుండి జిల్లాలోని ప్రముఖదేవాలయాలైన ఏడుకొండలవారిని, తిరుచానూరు పద్మావతీదేవి. శ్రీకాళహస్తీశ్వరుని, రామాలయాలను సందర్శించే భాగ్యానికి నోచుకొంటున్నారు.

చిత్తూరుజిల్లా ఆంధ్రప్రదేశ్‌లో ప్రముఖప్రాశస్త్యాన్ని పొందినది కారణం ఈజిల్లాలో చారిత్రార్థకమైన అతిప్రాచీనమైన దేవాలయాలు వెలసి వుండుట అంతేగాక భారతదేశములోని వివిద రాష్ట్రాలనుండి ప్రపంచములో పర్యాటకులకు ఈ జిల్లాలోని తిరుమల-తిరుపతి దేవస్థానములు ఏడుకొండల శ్రీ స్వామి వారి దర్శనంనకు అందరు అత్యంతభక్తి ప్రపత్తులతోవస్తూ ఉంటారు తిరుమల-తిరుపతి యేగాక దక్షిణకాశీగావాసికెక్కిన శ్రీకాళహస్తి ఈ జిల్లాలోనేగలదు, శ్రీ వెంకటేశ్వరుని దర్శనం తరువాత శ్రీకాళహస్తీశ్వరుని దర్శించకుండా వెళ్ళరు. అటే ఈజిల్లాలో అనేక పుణ్యక్షేత్రాలు పర్యాటకులకు విహారస్థలాలు ఎన్నో వున్నాయి వీటన్నిటినిగురించి తెలుసుకోవడానికి జిల్లాలోని ప్రముఖ దేవాలయాలు వివరాలు ఇందులో తెలుపబడినవి

తిరుపతి :— శ్రీ వెంకటేశ్వర దేవాలయము,తిరుపతి-తిరుమలతో కలియుగ వైకుంఠముగా పేరుపొంది ప్రతిరోజు పర్వదినంగా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా, ఆధ్యాత్మిక వేదగోష్టులతో భక్తాదులను విశేషంగా ఆకర్షిస్తున్న తిరుమలకొండపై వెలసిన అతిపురాతనమైన దేవాలయం.

కలియుగానికి పూర్వం ఈఆలయం ఏర్పడియున్నట్లు చరిత్ర ఆధారములతో అనేక వివరాలున్నాయి వాటిని పరిశీలించినపుడు ఒకానొకప్పుడు యజ్ఞంచేస్తున్నసమయలో అధిపత్యం త్రిమూర్తులలో ఎవరికి ఇవ్వాలని సందేహంరాగా భృగుమహర్షిబ్రహ్మ. పరమేశ్వరులను శపించ విష్ణువు దగ్గరికివెళ్ళి కోపించి ఆయన వక్షస్థలంపై తన్నగా ఆయన మహర్షినిసత్కరించి పంపెనని, అందుకు లక్ష్మీదేవి కోపగించి వైకుంఠమును విడచివెళ్ళగా ఆమెనువెతుక్కొంటూ భూలోకానికివచ్చి వేంకటాచలంపై వరాహస్వామి వారి సహాయంతో విష్ణువునెలకొనెనని ఆకాశరాజు కుమార్తె పద్మావతిని పరిణయమాడేందుకు కుబేరుని ధనసహాయాన్నిపొంది కలియుగాంతానికి చెల్లించగలనని వాగ్దానంచేసి భక్తాదులనుండి కానుకలను వడ్డీరూపంగా చెల్లిస్తున్నాడని ప్రతీతి అందుకే ఈస్వామివారిని వడ్డికాసులవాడు అనిఅంటారు

ఆలయాన్ని మొదట తొండమాన్ చక్రవర్తి కట్టించాడని శ్రీ స్వామివారి విగ్రహం స్వయంవ్యక్తమని ప్రజలవిశ్వాసం ఎందరోరాజులు ఈస్వామివారి ఆలయానికి మెరుగులుదిద్ది పూజలకై మాన్యాలు దానంచేసి తరింపారు ఋగ్వేదంలోనే ఈ వెంకటేశ్వరస్వామి వారి ప్రసక్తి ఉన్నట్లు చెప్పబడు తుంది. వామన, స్కాంద, ఆదిత్య, భవిష్యోత్తర పురాణాలలో విపులమైన వివరణవుంది.

ఏడుకొండలపైకి కాలినడకన తిరుపతి నుండి చంద్రగిరి శ్రీవారి మెట్టునుండి ప్రయాణించవచ్చును. బస్సులు,కార్లు, ద్విచక్ర వాహనములలో చేరుకొనవచ్చును. ఇదివరలో ఒకేరోడ్డు రాకపోకలకువుండేది, ఇప్పుడు రెండు ఘాట్‌రోడ్లు మలుపులతో ప్రయాణానికి అనువుగా ఉన్నాయి

ఏడుకొండలపై వెలసిన ఆలయ బంగారువిమానము ప్రత్యేకఆకర్షణ అణువణువున ప్రత్యేకతలతోనిండి భక్తులకోరికలను తీర్చుతున్న స్వామివారి దేవాలయం అక్కడేజరిగే పండుగలగురించి వర్ణించడంకష్టం ప్రతిరోజు పర్వదినమే. కొండపైఏటాజరిగే బ్రహ్మోత్సవం ప్రముఖంగా చెప్పుకో దగినవి,

తిరుమలకొండపై చూడతగిన తీర్థాలు ముఖ్యమైనవి పాపవినాశం ఆకాశగంగ, గోగర్భము, వైకుంఠతీర్థం పాండవతీర్థం, చక్రతీర్థం, జాబాలి తీర్థం, ఘోణతీర్థం, రామకృష్ణతీర్థం, తుంబరతీర్థం, కుమారతీర్థం ఇవిగాక మరెన్నోతీర్థాలుకూడ వున్నాయి, ఇవిగాక తిరుమలలో శ్రీ వరదరాజస్వామి శ్రీ రంగనాదస్వామి, శ్రీ నరసింహస్వామి అంజనేయస్వామి వారలకుకూడ అపురూపమైన దేవాలయాలు విగ్రహాలున్నాయి,

తిరుమలలోను—తిరుపతిలో పుణ్యతీర్థాలు. దేవాలయాల సందర్శనకు వాహనాలు సమకూర్చబడనది, యాత్రికులు సర్వసౌకర్యాలతో ప్రయాణాల ద్వారా ఆలయాలు సందర్శించే వీలుకల్పించడంలో దేవస్థానంవారు శ్రద్ధ చూపుతుంటారు,

శ్రీ కపిలేశ్వర ఆలయం :— తిరుమలకొండ దిగువన జలపాతాలు పకృతి దృశ్యాలనడుమ ఉన్నప్రాచీనఆలయం ఈఆలయం తిరుపతి నడిబొడ్డునుంచి కిలోమీటరుదూరంలో వుంది. ఈఆలయం చోళులచే క్రీ.శ. 11వ శతాబ్దం

నిర్మించబడినది. ఇచ్చట శివలింగాన్ని కపిలమహర్షి ప్రతిష్ఠించెనని చెబుతు న్నారు. శివరాత్రి ఉత్సవాలు కార్తీక మాసంలో దీపం చెప్పుకోదగ్గవి. ఈ ఆలయములోనే వినాయకునికి సుబ్రమణ్యస్వామికి నవగ్రహాలకు కూడ పూజలు జరుగుతాయి యాత్రికులకు ఈదేవాలయం పవిత్రస్నానాలకు నిలయంగా వుంటుంది.

శ్రీ గోవిందరాజస్వామి దేవాలయం :— తిరుపతిపట్టణం నడిబొడ్డులో ఎందరో భక్తులను ఆకర్షిస్తున్న దేవాలయం ఎత్తైనగోపురం కలుగు తిరుమల దేవాలయానికి ఆదినుండి అనుబంధ దేవాలయం కావడంవల్ల దీనికి ఎంతో ప్రాముఖ్యతవుంది. శ్రీ మద్రామానుజాచార్యుల వారి అనుగ్రహంవల్ల ఈ ఆలయంకూడ అనాటికాలం నుండి నేటికి చెక్కుచెదరని పేరుప్రఖ్యాతలు ఉన్నాయి. ఈ ఆలయంలోకూడ బ్రహ్మోత్సవాలు తెప్పోత్సవాలు రథో త్సవాలు ఘనంగా జరుగుతుంటాయి.

శ్రీ ఆంజనేయస్వామి ఆలయం :— తిరుపతి గోవిందరాజస్వామి వారి ఆలయానికి తూర్పున ఆంజనేయస్వామిఆలయం అతిప్రాచీనకట్టడాలతో వెలసివుంది చూడవలసిన దర్శించి తరించవలసిన శక్తివంతమైన విగ్రహ ప్రతిష్ఠగల్గిన దేవాలయం ఈ దేవాలయాన్ని ప్రస్తావన 1991 నాటి శాసన ములో వుంది రాతిలో నిర్మించబడినది. తిరుమలకువచ్చే యాత్రికులకు గోవిందరాజస్వామిని ఆంజనేయస్వామిని దర్శించకుండావెళ్ళరు. శ్రీరామ నవమి సందర్భంగా ఉత్సవాలు రథోత్సవం ముఖ్యమైన పర్వదినాలు

శ్రీ పార్థసారథి దేవాలయం:— శ్రీ గోవిందరాజస్వామి ఆలయానికి ఎడమవైపుఉన్న ప్రాచీనదేవాలయం, నిత్యం పూజలు జరుగును.

శ్రీ కోదండరామస్వామి దేవాలయం :— తిరుపతి పట్టణంలో దాదాపు నడిబొడ్డున పురాతనమైన ఆలయము కీ. శ. 15-16 శతాబ్దాల నడుమ నిర్మించబడినది తిరుమలకు వెళ్ళివచ్చేయాత్రికులు ఈదేవాలయం సందర్శించకుండా వెళ్ళరు. నిత్యముపూజలు జరుగుతుంటాయి. శ్రీ రామ నవమి సందర్భంగా ఉత్సవాలు రథోత్సవం ముఖ్యమైన పర్వదినాలు

శ్రీ పాండురంగస్వామి దేవాలయం :— తిరుపతి కపిలతీర్థం రోడ్డు లోని ఆంజనేయస్వామిగుడికి దాదాపు ఎదురుగాఉన్న దేవాలయం.

శ్రీ నాదముని దేవాలయం :— తిరుపతి తీర్థకట్ట వీధి ప్రక్కన నాదముని వీధిలో క్రీ. శ. 16-వ శతాబ్దంలో నిర్మించిన ఆలయం వుంది.

శ్రీ కల్యాణ వెంకటేశ్వరస్వామి ఆలయం :— తిరుపతి తీర్థకట్ట వీధి గుండా కొత్త వీధి ప్రారంభములోనె శ్రీ కల్యాణవెంకటేశ్వరస్వామి దేవాలయం వుంది. ఇందులో ఆకర్షణీయమైన స్వామివారి విగ్రహం భక్తులను పులకరింపజేస్తుంది ఇక్కడ నవరాత్రి, వసంతోత్సవములు ముఖ్యమైనవిగా చెప్పవచ్చును.

శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం :— శ్రీ కల్యాణ వెంకటేశ్వరాలయానికి పశ్చిమ దిశగా ఆర్యవైశ్యులచే నిర్మించిన శ్రీ కన్యకాపరమేశ్వరీ అమ్మవారి గుడిలో శైవాగమప్రకారం పూజలు, నవరాత్రి, వాసవీ జయంతి ప్రముఖమైన పండుగలు. ఇక్కడ నవగ్రహాల గుడికూడ గలదు

శ్రీ కాళియమ్మగుడి :— తిరుపతి పట్టణంలోని గాలి వీధిలో వున్న అతి ప్రాచీనమైన ఆలయం శ్రీ కాళియమ్మగుడి ఇక్కడ స్త్రీలకు ప్రత్యేకత గలదు. నవగ్రహాల గుడి మరియు దేవీ నవరాత్రి ఉత్సవాలు ప్రతియేడు ప్రధానంగా జరుపబడును.

శ్రీ లక్ష్మీనారాయణస్వామి దేవాలయం — తిరుపతి పట్టణములోని శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయ దక్షిణ భాగంలో దక్షిణ మాడవీధిలోని పురాతన ఆలయం 200 సంవత్సరముల క్రిందట తొండమాన్ చక్రవర్తి దీనిని కట్టించారు. చక్కని రాతి స్థంభాలు, హాలు గలవు. కానీ ఈ దేవాలయ రూపులేఖలు అన్యాక్రాంతవాసుల మధ్య మాయమైనవి. ఈ దేవాలయం వైష్ణవమతపరమైన పర్వదినాలు ముఖ్యం. దేవాదాయ శాఖ నిర్వహణ లోపంతో ఈ ఆలయం అభివృద్ధి పొందలేకపోయినది.

శ్రీ హాతిరామ్‌జీ మఠం :— ఈ యొక్క హాతిరామ్‌జీ మఠం ఏడెనిమిది శతాబ్దాల చరిత్రవున్న ఈ యొక్కమఠం తిరుమలలోను, తిరుపతిలోను ఉంది. శ్రీ హాతిరామ్ బావాజీ శ్రీ వెంకటేశ్వరునితో పాచికలాడిన భక్తుడు. ఈ మఠాధిపతిని మహంత్ అంటారు. ఆంధ్రదేశానికి చెందిన ఆదోని, తమిళనాడులోని వేలూరు, శోళింగపురం, మహారాష్ట్రలోని

బొంబాయి, నాశిక్‌లలోనూ దీనియొక్క శాఖలు ఉన్నాయి. తిరుమల తిరుపతి ఏర్పడకముందు తిరుమలలోని ఆలయానికి వీరే ధర్మకర్తలు. నేటికి స్వామివారికి తొలి హారతి వీరిదే వీరియొక్క పూర్వీకుల జయంతి, వర్ధంతులతోపాటు శ్రీ రామ నవమి, కృష్ణాష్టమి మొదలైన పండుగలను కూడా జరుపుతారు. ఇక్కడ శాసనాలు చెక్కబడిన పన్నెండు రాగిరేకులు వున్నవి. ఇంతవరకు వాటిని పరిష్కరించిన ప్రయత్నం జరిగినట్లు కన్పించడంలేదని తెలుస్తున్నది.

శ్రీ జియ్యంగారి మఠం :— శ్రీ జియ్యంగారి మఠం కూడ తిరుమలలోను, తిరుపతిలోను గలదు. శ్రీ మద్రామానుజులు వారు నిర్దేశించినట్లే నేటికి ఇక్కడ పూజలు జరుగుతున్నాయి క్రీ శ. 1057లో శ్రీమద్రామానుజులు అప్పన్ శఠగోపరామానుజయ్యంగారికి ఈ మఠాన్ని అప్పగించారు. అధ్యయనోత్సవాలు, ఆళ్వారుల తిరునక్షత్రాలు వైష్ణవాగమ ప్రకారం ఉత్సవాలు అతివైభవంగా జరుపుతారు.

శ్రీ బుగ్గమఠం:— శ్రీ గోవిందరాజస్వామి సన్నిధిలో ఉన్న అతి ప్రాచీనమైన విశాలమైన మఠమిది. వైష్ణవాగమనాన్ని పాటించే ఈ మఠంలో బుగ్గ వుత్సవం శ్రీరామనవమి, శ్రీకృష్ణ జయంతి ముఖ్యమైన పండుగలుగా వున్నాయి.

శ్రీ ఉత్తరాది మఠం — శ్రీగోవిందరాజస్వామి ఆలయానికి తూర్పు దిశగా కోనేటివద్ద ఉన్న ఈ మఠం ఉత్తర భారతదేశం నుంచి వచ్చే యాత్రీకుల సాధువుల సౌకర్యార్థం శ్రీ దేవనాయకాచార్యులచే నిర్మించబడినది. వైష్ణవాగమనాన్ని పాటించే యీ మఠంలో ప్రాముఖ్యమైన పండుగలన్నీ వైభవముగా జరుగుచుండును. ప్రస్తుతం అతిరూపమైన విగ్రహం ప్రతిష్ఠించబడి దినదినిత్యం పూజలు జరుగుచుండును.

శ్రీ తాతయ్యగుంట గంగమ్మ దేవాలయము :— తిరుపతి మధ్య భాగంలో ఈ ఆలయాన్ని కాపు కులస్తులు నిర్మించినట్లు ప్రతీతి. ప్రతి మంగళ, శుక్రవారాలలో పూజలు జరుగుచుండును. మే నెలలో బ్రహ్మాండముగా వారంరోజులపాటు జరిగే గంగజాతర్లు ముఖ్యమైనవి దీని సమీపమున వినాయకునికి నేరేళ్ళమ్మకు కూడా ఆలయములున్నాయి. యీ

గంగమ్మ గుడితో ఆర్. టి. సి. బస్టాండు దక్షిణాన తిరుచానూరు వెళ్ళే దారిలోను కోర్టు సమీపంలోను గంగమ్మ గుడులు వెలసి నిత్యపూజలు జరుగుచుండును,

శ్రీ ఆంజనేయస్వామి దేవాలయం :— తిరుపతికి దాదాపు 15 కిలో మీటర్ల దూరంలో కరకంబాడి గ్రామంలోవుంది. వైష్ణవాగమ పూజలు, ప్రతి మంగళవారము విశేషపూజలు మే నెలలో విశేషంగా జరిగే హనుమజ్జయంతి ప్రముఖంగా చెప్పుకోదగినవి

శ్రీ అన్నపూర్ణేశ్వరీ దేవాలయము :— తిరుపతి - తిరుచానూరు మార్గంలో శ్రీ అన్నపూర్ణేశ్వరీ ఆలయం నెలకొల్పబడి నిత్యం వంద మంది వరకు అన్నదానం జరుగుచూ పూజలు, పండుగలు అతి వైభవంగా జరుగుచుండును.

శ్రీ అగస్తీశ్వరస్వామి దేవాలయము :— తిరుపతి నుండి చంద్రగిరి మార్గంలో సువర్ణముఖీ నదీ తీరాన వెలసివున్న శ్రీ అగస్తీశ్వర దేవాలయం దివాన్ బహదూర్ కీ, శే మొగిలి కేశవులురెడ్డిగారి వంశస్థులు కట్టించిరి, ఈ దేవాలయం తొండవాడ గ్రామమునకు చెందినది శైవాగమ ప్రకారం నిత్య పూజలు, ముక్కోటి రుద్రపాదాల ఉత్సవం, శివరాత్రి ఉత్సవాలు అత్యంత వైభవముగా జరుగును. 1979 ఏప్రెల్‌లో ఈ దేవాలయం జీర్ణోద్ధరణ కాబడి కుంభాభిషేకము కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతిస్వాముల వారిచే జరుపబడినది

శ్రీ కోదండరామస్వామి ఆలయం : చంద్రగిరిలోని శ్రీ కోదండ రామస్వామి ఆలయాన్ని శ్రీ కృష్ణదేవరాయలు కట్టించగా శ్రీరంగనాయకుడు పోషించాడని ప్రతీతి వైష్ణవాగమం ప్రకారం నిత్యపూజలు. శ్రీరామ నవమి, నవరాత్రి, ధనుర్మాస ఉత్సవాలు ఇక్కడ వేడుకలు, ఈ దేవాలయం 1912 సంవత్సరమున మొగిలిరెడ్డిగారి నారాయణస్వామి రెడ్డిగారు, తదుపరి రావుబహదూర్ మొగిలిరెడ్డిగారి రామకృష్ణారెడ్డిగారు వంశపారంపర్య ధర్మకర్తలుగా వుండి పునరుద్ధరించిరి. 1979 జూన్ నెలలో మరల జీర్ణోద్ధరణ జరిగి శ్రీమన్నారాయణ రామానుజజీయరుస్వామివారిచే జ్ఞాన యజ్ఞము జరుపబడినది.

శ్రీ మూలస్థానం ఎల్లమ్మ దేవాలయం : చంద్రగిరిలోనే ఉన్న ఈ ఆలయంలో ప్రతి మంగళ, శుక్రవారాలలో పొంగళ్ళు, సమర్పించుకొని మొక్కుబళ్ళు చెల్లించుకోవడం, జాతర్లు చేసుకోవడం ఇక్కడ ప్రజల నిత్యకార్యాలు. చుట్టుప్రక్కల గ్రామాలనుండి తండోపతండాలుగా అమ్మవారిని సేవించేందుకు వస్తూ పూజలందిస్తూంటారు.

శ్రీ కల్యాణ వెంకటేశ్వర ఆలయం :— తిరుపతి - బాకరాపేట మీదుగా వెళ్ళేదారిలో శ్రీనివాసమంగాపురంలో వెలసివున్నడు కల్యాణ వెంకటేశ్వరస్వామి దేవాలయం – గోపురం అతి ప్రాచీనమైన ఆలయం. ఆకర్షణీయమైన స్వామివారి విగ్రహం, తిరుమల దేవాలయంలోని స్వామివార విగ్రహంకంటే పెద్దది. ఇక్కడికి కూడా తిరుమల-తిరుపతి వచ్చే యాత్రీకులు సాధారణంగా శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామి దర్శనానికి వస్తుంటారు. ఇక్కడ దేవస్థానంవారిచే ప్రతి యేటా విశేష ఉత్సవాలు జరుగుచుండును.

శ్రీ భక్తాంజనేయస్వామి దేవాలయం — తిరుపతికి దాదాపు 40 కిలోమీటర్ల దూరంలో ఉన్న పాకాలలోని శ్రీ భక్తాంజనేయస్వామి దేవాలయం కీ. శే. శ్రీ సిద్దలింగపిళ్ళెగారు నిర్మించారు వైష్ణవాగమ ప్రకారం పూజలు జరుగుతాయి. శ్రీరామ నవమి, హనుమజ్జయంతి విశేషదినములు.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి దేవాలయం :— పాకాల-దామల్ చెరువు రోడ్డు ప్రక్కన వున్న అతి ప్రాచీనమైన శ్రీ ఆళ్వార్‌కుంట ప్రక్కన నున్న అగ్రహారంలో 1962 సంవత్సరంలో శ్రీ సి.వి సిద్ధయ్యమూర్తిగారి భిక్షాటనచే నిర్మించబడినది, ఈ శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి ఆలయం. దేవాలయఅభివృద్ధికి టి, టి. డి, వారు ముప్పైవేల రూపాయలు ఆర్థిక సహాయంతో ప్రహరీగోడ మండపం అసంపూర్ణంగా జీర్ణోద్ధరణ జరిగింది.

శ్రీ సుబ్రమణ్యస్వామి ఆలయం :— పాకాల సమీపం ఊట్లవారిపల్లెకు దక్షిణదిశలో 1946లో గ్రామ ప్రజల సహకారంతో కీ. శే, శ్రీ మునస్వామి ఆచారిగారిచే కట్టించిన సుబ్రమణ్యస్వామి ఆలయం. ప్రతి ఆడి కృత్తికకు ఉత్సవాలు వేడుకలు అతి వైభవంగా జరుగుచుండును.

శ్రీ శీతారామాంజనేయస్వామి దేవాలయం : తిరుపతికి పశ్చిమదిశగా 42 కిలో మీటర్లు దూరంలో వున్న దామల్ చెరువు గ్రామంలో శ్రీ సీతా

రామాంజనేయస్వామి దేవాలయం వుంది వైష్ణవాగమ ప్రకారం పూజలు శ్రీరామ నవమి సందర్భంగా ఉత్సవాలు వైభవంగా జరుగును.

శ్రీ అగస్తీశ్వర దేవాలయము — చిత్తూరు పట్టణంలో శ్రీ నీవానది ఒడ్డున వున్న అతిప్రాచీనమైన దేవాలయం శ్రీ అగస్తీశ్వర దేవాలయం శ్రీ సుందరేశ్వరస్వామి, కామాక్షి అమ్మవారు, శ్రీ సుబ్రమణ్య శ్రీ వినాయక నవగ్రహాదుల గుడులు ఈ ఆలయ ప్రాంగణములో వున్నాయి. ఇక్కడ మహాశివరాత్రి బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఇటీవల కాలంలోనే ఒకటి న్నర లక్షల రూపాయలతో జీర్ణోద్ధరణ జరిగింది.

శ్రీ సుందర వినాయకస్వామి దేవాలయం — దేవాదాయధర్మాదాయ సంస్థ ఆధీనంలో చిత్తూరు పట్టణంలో మధ్యభాగంలో శ్రీ సుందరవినాయక స్వామి ఆలయం వెలసివుంది. ఇక్కడ శైవాగమ ప్రకారం పూజలు జరుగు తాయి. చిత్రపౌర్ణమి అరుద్ర మహోత్సవం, వినాయక చవితి నిత్య పూజలతో ఉత్సవాలు జరుగును.

శ్రీ కోదండరామస్వామి దేవాలయము :— చిత్తూరు పట్టణ మధ్య భాగంలో కీ. శే. శ్రీ రాయం కన్నయ్యనాయనివారు 1929 సంవత్సర ములో దీనిని నిర్మించారు. పాంచరాత్ర అగమము ప్రకారము పూజలు జరుగుతాయి. శ్రీరామ నవమి బ్రహ్మోత్సవాలు పుష్పపల్లకి యిక్కడ అతి వైభవముగా జరుగుచుండును

శ్రీ శివషణ్ముఖ సుందరవినాయకస్వామి దేవాలయం .— చిత్తూరు పట్టణ బజారువీధిలో శ్రీ శివషణ్ముగస్వామి దేవాలయం వుంది. వైశ్య కులా లంకారులచే ప్రతిష్ఠింపబడినది, ప్రతిరోజు పూజలు - ఉత్సవములు జరుగు చుండును.

శ్రీ సుబ్రమణ్యస్వామి దేవాలయం :— చిత్తూరు పట్టణ దక్షిణ భాగ ములో గిరింపేటలో చెంగల్రాయకొండపై వెలసివుండి ప్రసిద్ధమైన శ్రీ సుబ్ర మణ్యస్వామి దేవాలయం వైశ్యకుల శ్రేష్ఠులచే ఈ ఆలయం ప్రతిష్ఠించబడి నది. వంశపారంపర్య ధర్మకర్తల ఆధ్వర్యములో పూజలు జరుగుతున్నవి. ఆడికృత్తిక, కార్తీకదీపోత్సవం, భక్తులను విశేషంగా ఆకర్షించే ఉత్సవాలు జరగుచుండును. ఇటీవలే ధర్మదాతయైన శ్రీ ఆదికేశవులు నాయుడుగారు

గోపురం. గుడి తూర్పుదిశగా రహదారి మెట్లు నిర్మాణం చేసి ఆలయ సంపూర్ణ జీర్ణోద్ధరణచేసి ఆలయ వైభవాన్ని పెంచినారు.

శ్రీ దుర్గమ్మ దేవస్థానం :— చిత్తూరు గిరింపేటలో వెలసివుండు శ్రీ దుర్గమ్మ దేవాలయం భక్తులపాలిట కోరికలు తీర్చు అమ్మగా వెలసి వున్నది. విశ్వబ్రాహ్మణ వంశీయులు దీనిని నిర్మించారు. శైవాగమం ప్రకారము మంగళ, శుక్రవారాలలోనేగాక నిత్య పూజలు జరుగుచూ దశరా పండుగలు, ఉత్సవాలు అతి వైభవముగా జరుగుచుంటును అట్లే గిరిపేట నడిబొడ్డున చౌడేశ్వరి ఆలయంకూడా వెలసి భక్తులను ఆకర్షిస్తూ కోరికలు తీర్చే తల్లిగా ఈ ఆలయానికి పేరువుంది.

శ్రీ కొళందీశ్వర వరదరాజస్వామి దేవాలయం :— చిత్తూరు పట్టణం కట్టమంచి నీవానదీ తీరంన వెలసివుండు శ్రీ కొళందీశ్వర వరదరాజస్వామి దేవాలయం చోళవంశీయులలో చిట్టచివరి రాజు ఒకానొక సమయంలో ఈ ప్రాంతములో వేటకువచ్చి విశ్రాంతి తీసుకొన ఈ దేవాలయాన్ని నిర్మించి నట్లు, ఆలయ నిర్వహణకై భూములు దానంచేసినట్లు ప్రతీతి జీర్ణావస్థలో నున్న యీ దేవాలయాన్ని టి. టి. డి. వారు ఆర్థిక సహాయాన్ని అంద జేసిరి. వైఖానస ఆగమం ప్రకారం పూజలు జరుగును

శ్రీ కోదండరామస్వామి దేవస్థానం — తిరుపతి–చిత్తూరు మార్గములో కొత్తకోట గ్రామంలో వెలసివుండు పవిత్రమైన శ్రీ కోదండరామ స్వామి దేవాలయం, దేవాదాయశాఖ ఆధ్వర్యము లోని నిత్యపూజలు, వైష్ణవ సాంప్రదాయ ప్రకారం జరుగుతాయి. శ్రీరామ నవమి, వైకుంఠ ఏకాదశి, పునర్వసు నక్షత్రం చెప్పుకోదగ్గ పర్వదినములు.

శ్రీ మాధవ నారాయణస్వామి, మరియు తిరుమలేశ్వరస్వామి దేవ స్థానములు :— చిత్తూరు - పుత్తూరు మార్గంలో యీ మాధవనారాయణ తిరుమలేశ్వరస్వామి ఆలయాలు వేల్కూరు గ్రామంలో వెలసివున్నాయి. ఇవి చోళులచే నిర్మించబడిన ప్రాచీన దేవాలయాలు, శ్రీ మాధవనారాయణ స్వామివారికి నిత్యపూజలు వైష్ణవాగమ ప్రకారం జరుగుతాయి, కృష్ణాష్టమి వైకుంఠ ఏకాదశి రోజులలో ప్రత్యేక పూజలు కలవు, శ్రీ తిరుమలేశ్వర స్వామివారికి శివరాత్రి ఉత్సవం ఆరుద్ర నక్షత్రం, తై మాసం రోజులలో

విశేష పూజలు జరుగుతాయి. తిరుమల-తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయముతో జీర్ణోద్ధరణ జరుగుచున్నది.

శ్రీ ధర్మరాజస్వామి దేవాలయము :— చిత్తూరు సమీపం దక్షిణ దిశగావున్న కన్నికాపురం గ్రామంలో శ్రీదర్మరాజస్వామి దేవస్థానం నిర్మాణము చేయబడినది. ఇక్కడ వైష్ణవ సాంప్రదాయ ప్రకారం పూజలు జరుగును. మహాభారత ఉత్సవాలు జరుగును ఇక్కడకూడా తిరుమల-తిరుపతి దేవస్థానమువారు జీర్ణోద్ధరణకు ఆర్థిక సహాయము నొసంగిరి.

శ్రీ వరదరాజస్వామి దేవాలయం :— చిత్తూరు గుడియాత్తం మార్గములో వున్న శ్రీ వరదరాజస్వామి ఆలయం వేదమూరు గ్రామంలో వెలసివుంది. గాయత్రి సావిత్రి సరస్వతి అనే మూడు నదులు కలిసే ఈ చోట పూర్వం ఒక్కసారి రాక్షసులను జయించగోరి బ్రహ్మదేవుని సలహామేరకు దేవేంద్రుడు తపస్సుచేయగా శ్రీ భూనీళా పెరుందేవి సమేతుడైన శ్రీ వరదరాజస్వామివారు ఇక్కడ వెలసిరని ప్రతీతి, వైశాఖ మాసంలో స్వామివారి బ్రహ్మోత్సవాలు అతి వైభవంగా పది రోజులు జరుగుతాయి. ఇక్కడ భక్తులకు ధర్మసత్రం ఆర్యవైశ్య ధర్మసత్రాలున్నాయి, తూర్పున పర్వత శ్రేణి, దక్షిణాన త్రివేణి సంగమం చూడదగ్గ దృశ్యాలు.

శ్రీ కోదండరామస్వామి దేవాలయం :— వేదమూరులో పేరెన్నిక గల మరొక దేవాలయం శ్రీ కోదండరామస్వామి దేవాలయం, భువనగిరి వంశస్థులచే నిర్మించబడినదని ప్రతీతి. వైష్ణవ సాంప్రదాయ ప్రకారం పూజలు జరుగును.

శ్రీ ఏకాంబరేశ్వరస్వామి దేవాలయం :— వేదమూరు గ్రామంలోనే త్రివేణి సంగమానికి పశ్చిమ తీరాన వెలసివున్న శ్రీ ఏకాంబరేశ్వరస్వామి దేవాలయం చోళవంశస్థులచే నిర్మించబడిన ప్రాచీన దేవాలయం, అటు తర్వాత విజయనగర రాజులచే పునరుద్ధరించబడినది. త్రిపురాసుర సంహారము తరువాత పరమేశ్వరుడు తన రౌద్రాకారాన్ని విసర్జించి శాంత స్వరూపుడై శ్రీ కామాక్షమ్మవారి సమేతముగా ఇచ్చట వెలసినారని పురాణ గాధ. శైవ సాంప్రదాయప్రకారం పూజలు జరుగుతాలు.

శ్రీ ముక్కంటీశ్వర దేవాలయము :— చిత్తూరు - పెనుమూరు మార్గంలోవున్న కలవకుంట గ్రామం బాహుదా - శర్మదా నదుల సంగమ

తీరాన శ్రీ ముక్కంటీశ్వర దేవాలయం జనమేజయుడు ప్రతిష్ఠించెనని ప్రతీతి. శిల్పశైలి చోళులది. ఆలయంలోవున్న శాసనాలవల్ల గోపుర, మహా మండపాలు ఉత్తర చోళులకాలంలో క్రీ శ. 10-11 శతాబ్దాలలో పునర్నిర్మితమైనదని, విజయనగర రాజులకాలంలో క్రీ. శ. 1439-1570 దేవాలయ పునర్నిర్మాణం శ్రీ వారి కైంకర్యాలకు దోహదమిచ్చినట్లు తెలుస్తుంది. సోమశేఖరుడనే దైవభక్తుడు తన పూర్వీకుల అస్తి నిమజ్జనంకోసం మణికర్ణికా ఘట్టానికి వెళ్తూ ఇచ్చట విశ్రమించి శ్రీ స్వామివారిని సేవించి తరించాడని ఒక పురాణ గాధ. అస్తి నిమజ్జనం చేయడం విశేషం. ఇక్కడ పూజలు శైవ సాంప్రదాయ ప్రకారము జరుగుతాయి.

శ్రీ సిద్దేశ్వర ఆలయం :— చిత్తూరునుండి వేపంజేరి మార్గంలో శ్రీ సిద్దేశ్వర ఆలయం వుంది. ఇక్కడ శివరాత్రి - ఆడికృత్తిక రోజులలో విశేష పూజలు ఉత్సవాలు జరుగుచుండును.

కాణిపాకం శ్రీ వరసిద్ధి వినాయకస్వామి దేవాలయం :— చిత్తూరు-ఐరాల మార్గంలో బాహుదా నదీ తీరానవున్న కాణిపాకం పేరెన్నికగన్న గ్రామం, ఈ గ్రామంలో వెలసిన శ్రీ వరసిద్ధి వినాయక దేవాలయం ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రము. పూర్వము ముగ్గురు మూగ-చెవిటి-గుడ్డివారు నీటి కొరతవలన ఒక బావిని లోతుచేయడానికి త్రవ్వుచుండగా మట్టిలో రక్తం కనబడింది. ఆ వింతను చూచేందుకు వచ్చిన ప్రజలు కొబ్బరికాయలు కొట్టి పూజించినపుడు ఆ కొబ్బరి నీళ్ళే "కాణి" మేర భూమి పారిందని అందువల్ల ఆ గ్రామానికి "కాణిపాకం" అనే పేరు వచ్చిందని ప్రతీతి. రానురాను అది "కాణిపాకం గానె అయింది ఇక్కడ వెలసిన వినాయకుని సేవించి తమ సమస్యలను పరిష్కరించుకొనేందుకు చిత్తూరు జిల్లా నలుమూలలనుండి ఎక్కువమంది వస్తుంటారు.

ఇక్కడ తిరుమల-తిరుపతి దేవస్థానంవారు ఆర్థికసహాయంతో ఎంతో అభివృద్ధి చెందినది. చక్కని కోనేరు గలదు, మహాద్వారంవద్ద కల్యాణ మంటపం మాడదగ్గది దేవస్థానం ప్రభుత్వ అధీనంలోవుంటూ నిత్యాన్న దానం పధకం ప్రవేశపెట్టి, నిత్యం పూజలు, అభిషేకము, రధోత్సవాలు వినాయక చవితిరోజున ముఖ్యమైన పండుగ జరుగును సంవత్సరం పొడుగునా వేలాది భక్తులతో యాత్రాస్థలంగా విలసిల్లుతున్నది కాణిపాకం.

శ్రీ మణికంఠేశ్వరాలయం : కాణిపాకంలో శ్రీ మణికంఠేశ్వరాలయం ప్రాచీనమైనది పశ్చిమ దిశలో వెలసివుంది. కుళోత్తుంగచోళుడు తన వ్యాధి నివారణకోసం శివుని ఆజ్ఞమేరకు నిర్మించిన 108 దేవాలయాలలో ఇది ఒకటి అని శాసనాలవల్ల తెలియుచున్నది. ఆలయ శిల్పరీతులు విజయనగర శైలిని అనుసరించడంవల్ల పునరుద్ధరణ విజయనగర రాజులకాలంలో జరి గిందని చెప్పుకోవచ్చును. శైవసాంప్రదాయం ప్రకారం పూజలుజరుగుతాయి.

శ్రీ వరదరాజస్వామి దేవాలయం : కాణిపాకంలోనే వెలసివున్న మరొక ప్రాచీన దేవాలయం చోళులకాలంలో నిర్మించబడినది. ఆలయం గోడలపై తమిళ శాసనాలు పరిశోధించవలసిన అవసరం వుంది. ఇక్కడ వైష్ణవసాంప్రదాయం ప్రకారం పూజలు జరుగుతాయి.

శ్రీ మొగిలీశ్వరస్వామి దేవాలయం — చిత్తూరు – పలమనేరు మార్గంలో మొగిలి రోడ్డు ప్రక్కననే వున్న ప్రసిద్ధిగాంచిన శ్రీ మొగిలీశ్వర స్వామి దేవాలయం వుంది దేవదత్తుడు అనే చోళరాజు ఈ ప్రాంతములో నివసించాడని చరిత్ర ఆధారాలు చెబుతాయి స్థలపురాణంవల్ల ఇది కలియుగ ఆరంభంనుంచి వున్నదని తెలుస్తుంది. ఈ ప్రాంతం రమణీయమైన ప్రకతి దృశ్యాలమధ్య వెలసిన దేవాలయమిది, గర్భగుడి వున్నచోట్ల శివలింగం చుట్టు మొదట మొగిలిపొదలుండేవని అందువల్ల అయనకు మొగిలీశ్వరుడన్న పేరుగల్గినదని ప్రజలలో ప్రచారం వుంది.

ఆలయానికి దక్షిణంగా ఉన్నకోనేటికి నందీశ్వరుని నోటినుంచి జల ధారవుంది, నైఋతి దిశలోవున్న దేవరకొండలో దొరికే పభూదినే స్వామి వారి పూజలకు వినియోగించడం విశేషం, ప్రతి సోమవారం విశేషపూజ లుండును. శివరాత్రి సందర్భంగా పదిరోజులపాటు బ్రహ్మోత్సవాలు చూసేందుకు చుట్టుప్రక్కల ప్రాంతాలనుండేగాక తమిళనాడు - కర్నాటక ప్రాంతాల ప్రజలు అధిక సంఖ్యలో వస్తుంటారు. ప్రస్తుతం జీర్ణోద్ధరణ జర గడముతో యిక్కడ విశ్రాంతి భవనము, గోపురాలు చక్కని ఆకర్షణలతో ఆలయం చూపరులకు భక్తిప్రపత్తులు కల్గించేవిధంగా వున్నాయి,

ఈ ఆలయ ఆలనాపాలనా అభివృద్ధిపథంలో బంగారు పాళ్యం

జమీందారు శ్రీసుబ్బరామప్పనాయనింవారు వంశపారంపర్య ధర్మకర్తలుగా నిర్వహణబాధ్యతలు చూస్తున్నారు.

శ్రీ వీరభద్రస్వామివారి దేవాలయం :— చిత్తూరు - బరాల మార్గం ఎల్లంపల్లె సంతగేటు కుళ్ళంపల్లె గ్రామంలో శ్రీ వీరభద్రస్వామి ఆల యము వుంది ఇక్కడ మహాశివరాత్రినాడు వైభవంగా ఉత్సవాలు వేడు కలు జరుగును, గ్రామీణ ప్రజల భక్తి ప్రవర్తులకు నిదర్శనం.

శ్రీ కాశీవిశ్వేరాలయం — చిత్తూరు జిల్లా, పలమనేరు ప్రాంతంలో పలమనేరు పట్టణ మధ్యభాగంలో అతి పురాతనమైన దేవాలయం శ్రీ కాశీ విశ్వేశ్వరాలయం వుంది అమ్మవారు, గణపతి, నవగ్రహాలకు వేరువేరుగా గుడులు, చాల పెద్దగంట చెప్పుకోదగ్గ విశేషం. ఇక్కడికి సమీపంలో తిరు పతి గంగమ్మ దేవస్థానం గలదు. ప్రతి సంవత్సరం మే నెలలో జాతరలు జరుగును శ్రీ కళ్యాణవెంకటేశ్వర స్వామి ఆలయం గలదు. ఇది చాల పురాతనమైనది. వైఖానస అగమం ప్రకారం పూజలు జరుగుతాయి ఇక్కడ జరిగే బ్రహ్మోత్సవాలు, జాతరలు చూడ వేడుకగావుండును।

శ్రీ చెల్వరాయస్వామి దేవాలయం :— పలమనేరుకు పశ్చిమ దిశలో 10 కిలో మీటర్లదూరంలో శ్రీ చెల్వరాయస్వామి దేవాలయం అతి ప్రాచీనమైనది. ఇక్కడ బ్రహ్మోత్సవములు పాంచరాత్ర అగమం ప్రకారం నిత్యపూజలు అతి వైభవముగా జరుగును,

శ్రీ కళ్యాణవెంకటరమణస్వామి దేవాలయం :— పలమనేరుకు పశ్చిమదిశ 16 కిలో మీటర్ల దూరంలో ఉన్న పట్నంపల్లె గ్రామంలో చిన్న రాతిగుట్టపై శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి దేవాలయం ఉన్నది. పాంచరాత్ర అగమప్రకారం జరిగే నిత్యపూజలతోపాటు బ్రహ్మోత్సవంలు ప్రత్యేకించి పుష్పపల్లకి అతివైభవముగా వేడుకలు జరుగును.

శ్రీ ధ్యానాభిరామస్వామి దేవాలయం :— పలమనేరుకు 30 కిలో మీటర్ల దూరంలో శ్రీ ధ్యానాభిరామస్వామి దేవాలయం దాసార్లపల్లె గ్రామ ములో పెద్ద రాతి గుట్టమీద వెలసివుంది. పాంచరాత్ర అగమ ప్రకారం పూజలు బ్రహ్మోత్సవములు అతి వైభవముగా జరుగును. దీనిని గాంచ కర్నాటక ప్రాంత ప్రజలు యేతెంచుచుందురు.

శ్రీ కోదండరామాలయం : బైరెడ్డిపల్లెలో శ్రీ కోదండరామాలయం ప్రసిద్ధి గాంచినది. ఇక్కడ ఆగమప్రకారం పూజలు, రథోత్సవం అతి వైభవముగా జరుగును. ఇక్కడ వర్తకులు దేవాలయానికి మాన్యాలు యిచ్చినారు

శ్రీ కోదండరామస్వామి ఆలయం : రామకుప్పం గ్రామంలో ప్రసిద్ధి గాంచిన శ్రీ కోదండరామాలయం వుంది ఇక్కడ యేటా బ్రహ్మోత్సవములు వైభవంగా జరుగును. మరియు విఖాశన ఆగమం ప్రాకారం పూజలు నిర్వహింతురు,

శ్రీ సోమేశ్వర ఆలయం : కుప్పం పట్టణానికి తూర్పున శ్రీ సోమేశ్వర ఆలయం అతి పూరతనమైనది గలదు నవగ్రహ మంటపం గల్లదు ఇక్కడ శైవాగను ప్రకారం జరిగే నిత్యపూజలు వైభవంగా జరిగే బ్రహ్మోత్సవాలు చెప్పుకోతగినవి,

శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం : కుప్పంనకు 12 కి. మీ. దూరంలో అతి పురాతనమైన శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం గలదు, ఇది విజులాపురం గ్రామంలో నిర్మించబడి పాంచరాత్ర ఆగమం ప్రకారం నిత్య పూజలు-బ్రహ్మోత్సవాలు అతి వైభవంగా జరుగును, దీనికి కుప్పం జమిందారులు వంశపారంపర్య ధర్మకర్తలుగా నిర్వహించుచున్నారు.

శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం : కుప్పం ప్రాంతం కంగొంది గ్రామంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం నిర్మాణంమైవుంది ఇది చాల ప్రాచీనమైనది ఇక్కడ శిల్ప నైపుణ్యం చక్కగా కన్పించును, పాంచరాత్ర ఆగమం ప్రకారం పూజలు అతి వైభవముగా జరుగును.

శ్రీ రాళ్ల గంగమాంబ దేవాలయం : కుప్పంనకు 15 కి. మీ. దూరంలో ఒంటిపల్లె గ్రామంలో శ్రీ రాళ్ల గంగమాంబ దేవాలయం వెలసి వుంది. ప్రతి సంవత్సరం జాతరలో ఎద్దులవరుష జరుగును. ఇక్కడ వేడుకలు అతి వైభవంగా జరుగును.

శ్రీ బేట రాయస్వామి దేవాలయం : కుప్పంనకు పడమర దిశలో

6 కి. మీ. దూరాన ఉన్న బేట రాయస్వామి దేవాలయం అతి పురాతన మైనది. ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, రాష్ట్రాలు కలసే అడవి ప్రదేశంలో ఎత్తైన కొండలపై యీ దేవాలయం వెలసి వుంది, చరిత్రప్రసిద్ధి కెక్కిన దేవాలయం శ్రేట్రాయిసామి దేవుడా! అన్నమకుటంతో పల్లె పాటలు భక్తి గేయాలు, ఆంధ్రదేశమంతా వ్యాప్తి చెందినది. ఆలయ పూజలు వైఖానస ఆగమానుసారం జరుగుతాయి ఈ దేవాలయ ప్రాముఖ్యతను గుర్తించి తిరుమల దేవస్థానంవారు ఆర్థిక సహాయం అందించారు.

శ్రీ కోదండరామాలయం : కుప్పంనకు సమీపంనగల రాళ్ల బూదుగురులో శ్రీ కోదండరామాలయం ప్రసిద్ధిగాంచినది ఇక్కడ పాంచరాత్ర ఆగమప్రకారం పూజలు జరుగును. ఈ దేవాలయానికి రాళ్లబూదుగురు జమిందారులు వంశపారపర్య ధర్మకర్తలుగా ఈ దేవాలయ ఆలన పాలన చూస్తుంటారు.

శ్రీ ప్రసన్న వేంకటరమణస్వామి దేవాలయం : కుప్పం సమీపం కనమనపల్లె గ్రామంలో అతి విశాలమైన ప్రసిద్ధి గాంచిన శ్రీ ప్రసన్న వేంకటరమణస్వామి దేవాలయం గలదు. ఎత్తైన ప్రహరీ గోడగలిగి గాలిగోపురం కూడ వున్నాయి. పాంచరాత్ర ఆగమప్రకారం ఇక్కడ పూజలు వైకుంఠ ఏకాదశి గోకులష్టమి, బ్రహ్మోత్సవములు అతి వైభవముగా జరుగును,

శ్రీ వరదరాజస్వామి దేవాలయం : కుప్పం ఉత్తరముగా 2 కి.మీ. దూరం గల లక్ష్మీపురంలో శ్రీ వరదరాజస్వామి దేవాలయం అతి ప్రాచీన మైనది. ఇక్కడ ఎత్తైన ప్రహరీగోడ, గాలిగోపురం గలదు. పాంచరాత్రాగమానుసారం పూజలు అతి వైభవముగా బ్రహ్మోత్సవములు, వైకుంఠ ఏకాదశి వేడుకలుండును.

శ్రీ కృష్ణ దేవాలయం : కుప్పం పట్టణంలో శ్రీ కృష్ణ దేవాలయం అతి సుందరంగా విశాలమైన స్థలంలో నిర్మించబడి వున్నది ఇక్కడ పేద బిడ్డలకు ఆశ్రయం కల్పించబడి హైందవాచారముల ప్రకారం నిత్యపూజలు వేడుకలు అతి వైభవంగా జరుగును.

శ్రీ అఘోరవీరబద్రస్వామి దేవాలయం : పుంగనూరు పట్టణంలో శ్రీ అఘోరవీరబద్రస్వామి ఆలయం ప్రసిద్ధి గాంచినది. ఇది జమీందారి కోట ప్రాంగణములో గలదు ఈ దేవాలయంతోపాటు శ్రీ గోమేశ్వర స్వామి శ్రీ మాణిక్యవరదరాజస్వామి ఆలయాలు అతి పూరతమైనది గోపుర ములు గల్గివున్నవి. ఈ ఆలయ గోపురాలు పట్టణానికే ప్రత్యేకమైన శోభ నిచ్చుచున్నాయి.

శ్రీ అగస్తీశ్వరాలయం : పుంగనూరుకు తూర్పున 15 కి. మీ. దూరములో నెక్కొండి గ్రామంలో ఒక పెద్ద గుట్ట గలదు. ఇక్కడ పూరాతన కాలంలో అగస్త్యమునిచే విగ్రహ ప్రతిష్ఠ జరిగిందని ప్రజల విశ్వాసం. ఈ ఆలయంలో శైవ ఆగమప్రకారం నిత్యం పూజలుండును శివరాత్రి ఉత్సవాలు రథోత్సవము కడువైభవముగా జరుగుచుండును. ఈ గుట్టపై ఏర్పాటు అయివున్న కోనేరు తిరుమలలోవున్న కోనేరువలె పోలివుంది.

శ్రీ వేణుగోపాల, కాశీవిశ్వేశరాలయం : పుంగనూరు ప్రాంతము తూర్పు దిశగా 16 కి. మీ. దూరంలో శ్రీ వేణుగోపాల శ్రీ కాశీవిశ్వేశ్వరాలయాలు వున్నాయి ఇవి శిల్ప నైపుణ్యం కల్గి చూడ వింతగొలిపే విధంగా వుంటూ నిత్య పూజలు జరుగుచుండును

శ్రీ చెన్న కేశవస్వామి దేవాలయం : పుంగనూరు తూర్పు 20 కి. మీ. దూర ప్రాంతములో శ్రీ చెన్న కేశవస్వామి ఆలయము, దీనితో పాటు మరొక సోమేశ్వరస్వామి ఆలయం కూడా ప్రసిద్ధిగాంచి ప్రజలు నిత్య పూజలు అందుకొంటున్నారు. ఈ ప్రాంతములో అనేక పుణ్య దేవ స్థానాలు—భక్తులకు నిలయాలుగా శిథిలావస్థలో వున్నాయి.

శ్రీ భీమేశ్వరాలయం : పుంగనూరుకు ఉత్తర దిశలో 6 కి. మీ దూరంలోభీమగానిపల్లెలో శ్రీ భీమేశ్వరాలయం గలదు. ఇది రాయలనాటిదని ప్రతీతి పుంగనూరు జమిందారులు యీ ఆలయ నిర్వహణలు చేపట్టి నిర్వహించినట్లు అక్కడ శాసనాల వలన తెలుస్తున్నది. శైవాగమం ప్రకారం పూజలు జరుగును

శ్రీ కోనేటి రాయస్వామి ఆలయం : ఈ శ్రీ కోనేటిరాయస్వామి ఆలయం పుంగనూరు 30 కి మీ. దూరంలో కీలపట్ల గ్రామంలో గలదు. ఈ ఆలయమూల విరాట్టు తిరుమల శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఎత్తు వుంటారు. ఈలాంటి ప్రసిద్ధిగాంచిన ఆలయంలో వైఖానస ఆగమం ప్రకారం నిత్య పూజలు జరుగుతాయి.

శ్రీ కాశీవిశ్వేశ్వరాలయం : పుంగనూరుకు ఈశాన్యదిశ 50 కి.మీ దూరప్రాంతములో అతి ప్రసిద్ధిగాంచిన పురాతనమైన శ్రీ కాశీవిశ్వేశ్వరాలయం గోనుమాకులపల్లె గ్రామంలో వెలసివుంది. ఇక్కడ నిత్య పూజలు జరుగుతాయి.

శ్రీ కళ్యాణ వెంకటరమణస్వామి : పుంగనూరు పశ్చిమ దిశలో శ్రీ కళ్యాణ వెంకటరమణస్వామి దేవాలయం ప్రసిద్ధిగాంచినది. దీనితోపాటు శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామి దేవాలయం కూడా గలదు ఇక్కడ ప్రజలు వేడుకలతో నిత్య పూజలు జరుగుతాయి. ఈ ఆలయాల నిర్వహణ వంశపారంపర్య ధర్మకర్తలు, దేవదాయ శాఖవారు నియమించిన ధర్మకర్తలు కూడా వున్నారు.

శ్రీ వాలేశ్వర ఆలయం : పుంగనూరు పశ్చిమ మార్గంలో నున్న ఆర్. నడింపల్లె గ్రామంలో వెలసివున్న శ్రీ వాలేశ్వర ఆలయం అతి ప్రాచీనమైనది. శైవాగమం ప్రకారం పూజలు, శివరాత్రి ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి. ఇక్కడికి 6 కి.మీ. దూరములో మరో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంకూడా ప్రసిద్ధిగాంచి నిత్య పూజలు జరుగుతాయి. ఇది కుదురు చీమనపల్లెగా వెలసివుంది.

శ్రీ నీలకంఠేశ్వరాలయం : పుంగనూరు తిరుపతి మార్గంలోవున్న ఉద్దిగం గ్రామంలో శ్రీ నీలకంఠేశ్వరాలయం గలది. ఇది ప్రసిద్ధిగాంచిన ఆలయం ప్రాచీనమైనది. శైవసాంప్రదాయ ప్రకారం పూజలు జరుగుతాయి ఇక్కడ మరో శ్రీ పుండేశ్వరాలయం కూడా వుంది. ఇక్కడ కూడా నిత్య పూజలు జరుగుతాయి.

శ్రీ అరకేశ్వర ఆలయం : పుంగనూరు దక్షిణభాగంలో 10 కి. మీ. దూరంలో శ్రీ అరకేశ్వర ఆలయం కరసనపల్లెలో వెలసివుంది. ఈ ఆలయం ప్రసిద్ధి గాంచిన పూరాతనమైనది. ఇక్కడ నిత్య పూజలు జరుగుతాయి.

శ్రీ ప్రసన్న వెంకటరమణస్వామి ఆలయం : మదనపల్లె పట్టణంలో అతి ప్రాచీనమైన ప్రసిద్ధిగాంచిన శ్రీ ప్రసన్న వెంకటరమణస్వామి ఆలయం గలదు. ఈ దేవాలయం చోళరాజులుచే నిర్మించబడినట్లు ప్రతీతి. ఇక్కడ పండుగలు అతివైభవముగా ప్రతియేట జరుగుచూ అన్ని విదాల అందరి భక్తులను ఆకట్టుకొనే విధంగా వేడుకలు జరుగుతాయి.

శ్రీ యోగభోగేశ్వరాలయం : మదనపల్లె పడమరదిశగా బిప్పిలి గ్రామంలో శ్రీ యోగభోగేశ్వరాలయం దేవాదాయ దర్మాదాయశాఖ తరపున కార్యనిర్వహణ అధికారి అధ్వర్యములో ఆలయ పాలన వ్యవహారములు జరుగును ఇక్కడ విశేషంగా బ్రహ్మోత్సవాలు, శరన్నవరాత్ర ఉత్సవాలు కార్తీక మాసములో నిత్యర్చనలు ముఖ్యముగా చెప్పుకోతగ్గవి. ఇక్కడ శ్రీ సుబ్రమణ్యస్వామి ఆలయం-నవగ్రహాల గుడి కూడ గలదు.

శ్రీ ఏనుగుమల్లమ్మ దేవాలయం : మదనపల్లె హార్సిలీకొండపై వెలసిన శ్రీ ఏనుగుమల్లమ్మ దేవాలయం ఇక్కడ ప్రజలకు ఆరాధ్య దైవము ఇక్కడ ప్రజలు అమ్మవారిని నిత్యం సేవిస్తూ పూజలు అందిస్తుంటారు. ఇక్కడ సంవత్సరానికొకమారు జరిగే జాతర ఉత్సవాలు చెప్పుకోదగ్గవి.

శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం : బీరంగి కొత్తకోట గ్రామంలో వెలసివుండు శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం ప్రసిద్ధిగాంచినది ఇక్కడ ఈ దేవాలయంతోపాటు శ్రీ బోళేశ్వర, ఆంజనేయ, గంగమ్మ దేవాలయాలు కూడా గలవు. ఈ ఆలయాలు అతి ప్రాచీనమైనవి. ఈ ఆలయాలు శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో నిర్మించినట్లు చరిత్రాధారాలు వున్నట్లు ప్రతీతి. ఇక్కడ నిత్య పూజలు వేడుకలు వినోదములు జరుగుతాయి.

శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం : మదనపల్లెకు 15 కి. మీ.

దూరములో గల తెట్టు గ్రామంలో అతిపురాతనమైన శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం వుంది. ఇది బాల ప్రసిద్ధిగాంచిన దేవాలయం ప్రతి సంవత్సరము పది రోజులపాటు బ్రహ్మోత్సవాల ఘనంగా జరుగుతాయి. నిత్యపూజలు కూడా వుంటాయి

శ్రీ ప్రసన్న వెంకటరమణస్వామి ఆలయం : మదనపల్లెకు 30 కి.మీ. సమీపంలో వున్న కోసువారిపల్లెలో శ్రీ ప్రసన్న వెంకటరమణ స్వామి దేవాలయం ప్రసిద్ధి గాంచినది ఈ దేవాలయం అలనాటి శ్రీ కృష్ణ దేవరాయల కాలంనాటిదని ప్రతీతి. సంవత్సరానికి 10 రోజులు పాటు అతి వైభవముగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి

శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయం : మదనపల్లెకు ఉత్తరాన 70 కి. మీ. దూరంలో పాపేపల్లి గ్రామంలో ఓన్నరాతిగుట్టపై వెలసివున్న శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయం ప్రసిద్ధిగాంచినది. ఇక్కడ బ్రహ్మోత్సవాలు జరగడం విశేషం ఈ ప్రాంతములోనే కన్నెమడుగు గ్రామంలో శ్రీ ఆవు దేవత దేవాలయం గలదు. ఇక్కడ నిత్య పూజలు జరుగుతాయి. ఇక్కడ సమీపంలోనే శ్రీ వెంకటేశ్వర టాం టాం ఎద్దుదేవర దేవాలయం పిచ్చావాండ్లపల్లెలో గలదు. ఇక్కడ కాపువారే అర్చకులుగా వుండడం విశేషం.

శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయం : మదనపల్లె ఈశాన్య దిశగా వున్న ఓన్న తిప్పసముద్రంలో లక్ష్మీ నరసింహస్వామి ఆలయం వుంది. ఈ ఆలయం రాయ నాటిదని ప్రతీతి. ఇక్కడ బ్రహ్మోత్సవములు పాంచరాత్ర ఆగమము ప్రకారము పూజలు జరుగుతాయి. ఈ ఆలయానికి వంశపారంపర్య ధర్మకర్తలు న్నారు

శ్రీ పట్టాభిరామస్వామి దేవాలయం : వాయల్పాడు పట్టణంలో వెలసివుండు శ్రీ పట్టాభిరామస్వామి దేవాలయం అతి పురాతనమైన ప్రాచీన దేవాలయం. ఈ దేవాలయం రాయల నాటి కాలంలో నిర్మించబడినట్లు ప్రతీతి ఇక్కడ శ్రీ సీతారామలక్ష్మణ అంజనేయస్వామివార్ల మూల విగ్రహాలు ఒకే చోట వుండడం విశేషంగా యీ ప్రజలు భావిస్తారు. నిత్యపూజలు

బ్రహ్మోత్సవాలు అతి వైభవముగా వేడుకలు జరుగుతాయి.

శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయం : ఈ దేవాలయం వాయిల్పాడు గుర్రంకొండ మార్గంలో తరిగొండ గ్రామంలో గలదు ప్రపంచ ప్రసిద్ధి గాంచిన శ్రీ వైకుంఠ నిలయం వాసుడైన తిరుమల గిరి శ్రీ వెంకటేశ్వరస్వామిని సేవించి తరించిన తరిగొండ వెంకమాంబ జన్మించిన పుణ్యస్థలం. గొల్లభామలు పెరుగును చిలుకుతుండగా పెరుగుకుండ (తరికుండ) నుంచి స్వామివారు ఉద్భవించినట్లు ఇతిహాసము గలదు. ఈ దేవస్థానం ముందున్న ధ్వజస్తంబం వద్దగల పీఠంపై చేతులు ఆనించి కోర్టుకువెళ్లి ప్రమాణంచేస్తే న్యాయవాదులు కూడ అంగీకరించడం ఇక్కడ విశేషం.

శ్రీ సిద్దేశ్వరస్వామి దేవస్థానం : బాకరాపేట నెరబైలు మార్గంలో తనకోనలో వెలసిన శ్రీ సిద్దేశ్వరస్వామి దేవాలయం చాల ప్రసిద్ధమైంది. పవిత్రమైన పుణ్యక్షేత్రంగా వాసికెక్కినది. ఈ దేవాలయం దట్టమైన అడవులమధ్య గలదు దీని సమీపంలోనే శిరోద్రోణం పాపవిమోచనం నెలకోన మొదలైన తీర్థాలున్నాయి. మహాశివరాత్రి ఉత్సవాలు అతి వైభవముగా జరగును ఈ ప్రాంతము విశ్రాంతిగా గడపడానికి ఒక పర్యాటక కేంద్రంగాను వుండడం విశేషం.

శ్రీ ద్రౌపతీ సమేత ధర్మరాజస్వామి దేవాలయం : పుత్తూరు పట్టణంలో వెలసివుండు శ్రీ ద్రౌపతీ సమేత ధర్మరాజస్వామి దేవాలయం ప్రసిద్ధిగాంచి యిక్కడ ప్రజల కోర్కెలు తీర్చుటలో, సత్ఫలితాలు కలుగుతాయని పేరుంది ప్రతి ఏట అడి నెలలో బ్రహ్మోత్సవాలు వైష్ణవసాంప్రదాయకంగా ఎంతో వైభవంగా జరుగుతాయి. ఇక్కడ ప్రజలు భక్తులు తమ కోరికలు ఫలిస్తాయని అగ్నిగుండ ప్రవేశం చేస్తుంటారు.

శ్రీ కైలాసనాథస్వామి దేవాలయం : పుత్తూరుకు తూర్పు దిశలో 13 కి.మీ. దూరంలో గల ఎత్తైన కొండలలో అరుణానదీ తీరాన సుందరమైన ప్రకృతి దృశ్యాల మధ్య వెలసిన శ్రీ కైలాసనాథస్వామి దేవాలయం సమీపంలో వున్న జలపాతం చూడతగ్గది ఇక్కడికి సమీపనగల నారాయణవనంలో గల శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామివారి కళ్యాణాన్ని చూసేందుకు

వచ్చిన పార్వతీపరమేశ్వరులు, ఇక్కడే విశ్రాంతి తీసుకున్నారని పూరాణ గాథ కూడా వుంది. శైవసాంప్రదాయ ప్రకారం ఇక్కడ పూజలు జరుగును. ప్రక్క రాష్ట్రమైన తమిళనాడు నుండి గూడా ప్రజల రాకపోకలు గలవు. ఈ ప్రాంతము పర్యాటన స్థలంగా దినదినాభివృద్ధి చెందడం విశేషం.

శ్రీ దేశమ్మ దేవాలయం : నగరి పట్టణానకు యేడు కి. మీటరు దూరాన శ్రీ. దేశమ్మ దేవాలయం వెలసివుంది ఈ దేవత శక్తివంతమైన స్వరూపిణి. కోరిన కోరికలు తీర్చేతల్లిగా యిక్కడ ప్రాంతాలవారికి విశ్వాసంగలదు. ప్రభుత్వంవారు యిక్కడ భక్తులకు సత్రాలు నిర్మించియున్నారు శైవసాంప్రదాయం ప్రకారం నిత్య పూజలు జరుగుతాయి

శ్రీ. వైకుంఠనాథస్వామి దేవాలయం : నగరికి సమీపం కుశస్థలీ నదీతీరాన, వెలసివున్న శ్రీ వైకుంఠనాథస్వామి దేవాలయం వైష్ణవసాంప్రదాయం ప్రకారం పూజలు జరుగును పాంచరాత్ర అగమం ప్రకారం పూజలు వైకుంఠ ఏకాదశి, చిత్రపౌర్ణమి, పునర్వసు నక్షత్రం రోజులలో విశేష పూజలు జరుగుతాయి.

శ్రీ వేదనారాయణస్వామి ఆలయం : పుత్తూరు మద్రాసు మార్గంలో నాగలాపురంలో వెలసివుండు. అతి ప్రాచీనమైన దేవాలయం శ్రీ వేదనారాయణస్వామి ఆలయం ప్రసిద్ధి గాంచినది. ఇక్కడ ప్రతి యేడు బ్రహ్మోత్సవాలు అతి వైభవముగా జరుగును

శ్రీ. కళ్యాణ. వెంకటేశ్వర దేవాలయం : పుత్తూరు తూర్పు దిశలో వున్న నారాయణవనంలో వెలసిన ప్రాచీన దేవాలయం శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామి ఆలయం గాలిగోపురాలు ఎత్తైనవి. ఈ పుణ్యక్షేత్రములోనే శ్రీ వెంకటేశ్వరస్వామికి, శ్రీ పద్మావతి అమ్మవారికి కళ్యాణం జరిగిందని ప్రతీతి. తిరుపతికి వచ్చే యాత్రికులు కూడా ఈ స్థలాన్ని దర్శించడం అవనాయితి యిక్కడ అవనాశమ్మగుడి మరియు వినాయక గుడి మొదలుగా గల దేవాలయాలున్నాయి. వీటిని తిరుమల తిరుపతి దేవస్థానమువారి అదీనములో పూజలు జరుగుతాయి.

శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం : పుత్తూరు చిత్తూరు మార్గంలో వున్న కార్వేటినగరంలో శ్రీ వేణుగోపాలస్వామి వారి ఆలయం ప్రాచీనమైనది ఈ ప్రాంతాన్ని చంద్రవంశ రాజైన ఆకాశరాజు పాలించినట్లు పురాణ ప్రసిద్ధి గాంచినది. కార్వేటినగర సంస్థానాధీశులు తమ వంశపారంపర్యంగా ఈ వేణుగోపాలస్వామి ఆలయ నిర్మాణం(శాలివాహనశకం 17వ శతాబ్దం) నుంచి అన్నిపిదాల ఆలనపాలన సేవలు చేసినట్లు సంస్థానం ప్రభువుల వంశావళిని బట్టి విదితమవుతుంది. శ్రీ కృష్ణజయంతి వైకుంఠ ఏకాదశి, వేడుకలు విశేషంగా జరుగుతాయి. శ్రీ కృష్ణ జయంతి చెప్పుకోతగ్గది. పూజలు పాంచరాత్ర ఆగమానుసారం జరుగుతాయి.

శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామి దేవాలయం : కార్వేటినగరంలో 19వ శతాబ్దం చివరభాగంలో తాము కాశీ యాత్ర చేసిన తరువాత కార్వేటినగర్ ప్రభువులు నగరం మధ్యలో నిర్మించిన దేవాలయం కాశీవిశ్వేశ్వరాలయం మహాశివరాత్రినాడు విశేష పూజలు జరుగును.

శ్రీ సదాశివస్వామి దేవాలయం : కార్వేటినగర సంస్థానాధీశులు, శాలివాహనశక 1617వ సంవత్సరంలో శ్రీ సదాశివస్వామి ఆలయాన్ని నిర్మించారు. ఇది చాల ప్రాచీన దేవాలయం ప్రసిద్ధిచెందిన ఆలయం కాక ఇక్కడ మహాశివరాత్రి ఉత్సవాలు అతి వైభవముగా జరుగును

శ్రీ గోవర్ధనేశ్వరస్వామి దేవాలయం : పుత్తూరు ప్రాంతములోని వేటపాళెం గ్రామంలో శ్రీ గోవర్ధనేశ్వరస్వామి దేవాలయం గలదు చాల ప్రాచీనమైనది. ఇది చోళుల కాలంలో నిర్మించినది. ఒకానొక కాలంలో ప్రస్తుతం దేవాలయం వున్న చోట ఒక ఆవు ప్రతిరోజు పుట్టలోకి పాలువదలి వెలుతూ వుండేదన్ని అప్పటి రాజు గమనింప అక్కడ ఈశ్వరుడు వెలసినట్లు కనుగొని ఆలయ నిర్మాణం చేసినట్లు స్థల పురాణంవలన తెలియుచున్నది ఈ ఆలయాన్ని పూర్వం కార్వేటినగర సంస్థానాధీశులు జీర్ణోద్ధరణ చేసినట్లుంది. తిరుపతి-తిరుమల దేవస్థానంవారు అందించిన ఆర్థిక సహాయం జీర్ణోద్ధరణ జరిగింది, కుంభాభిషేకం జరిగాయి, నిత్య పూజలతో సంవత్సరం ప్రత్యేక పూజలు శివరాత్రి ఉత్సవాలు ధనుర్మాస పూజలు, ఆరుద్ర నక్షత్రపూజలు విశేషంగా జరుగుతాయి.

శ్రీ వాలేశ్వరస్వామి ఆలయం : పుత్తూరు ఊతుకోట మార్గంలో వున్న రామగిరిలో చోళరాజులచే నిర్మించబడిన శ్రీ వాలేశ్వరస్వామి ఆలయం చాల ప్రసిద్ధి గాంచినది ప్రాచీనమైనదని ప్రతీతి తొలుత తిరుక్కారగిరి అని ఈ గ్రామాన్ని పిలిచేవారని, అంజనేయుడు కాశినుంచి తెచ్చిన శివలింగాన్ని ఇక్కడ కాలభైరవస్వామి కొండమీద ప్రతిష్ఠించిన నాటినుంచి ఇది రామగిరి అయిందని స్థల పురాణాన్నిబట్టి తెలుస్తుంది.

అంజనేయుడు తన కాలము (తోక)తో చుట్టి తెచ్చినందువలన ఇచ్చట దేవునికి వాలేశ్వరుడన్న పేరువచ్చిందని ప్రజల వాడుక ఇక్కడ ఆలయం లోవున్న కోనేటికి ఒకనంది విగ్రహం నోటినుంచి నీటిదారపడుతుంది మహా శివరాత్రి కార్తీకమాసంలో ఉత్సవాలు జరుగుతాయి.

శ్రీ సుబ్రమణ్యస్వామి ఆలయం : ఇక్కడ కొండపై శ్రీ సుబ్రమణ్య స్వామి ఆలయం నిర్మించబడినది. శైవాగమం ప్రకారం ప్రతి నెల కృత్తిక రోజు అభిషేకాలు ఆడికృత్తిక రోజు తెప్పోత్సవం అతి వైభవంగా జరుగును

శ్రీ మాతంగేశ్వరస్వామి దేవాలయం : సత్యవేడు ప్రాంతం పట్టణానికి దక్షిణములో 2 కి. మీ దూరంలో శ్రీ మాతంగేశ్వరస్వామి దేవాలయం ప్రసిద్ధి గాంచినది ఈ దేవాలయం చుట్టు రమణీయమైన ప్రకృతిదృశాలున్నాయి. ప్రతి సంవత్సరం మే నెలలో బ్రహ్మోత్సవం తెప్పోత్సవం అతి వైభవముగా జరుగుతాయి పూజలు శైవాగమ ప్రకారం జరుగుతాయి.

శ్రీ వేణుగోపాల ఆలయం : సత్యవేడు పట్టణం మధ్య భాగంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం వుంది ఈ ఆలయానికి వంశపారంపర్య ధర్మకర్తలు ప్రతి యేడు శ్రీరామనవమి సందర్భంగా ఇక్కడ ఉత్సవాలు కడువైభవంగా జరుగును.

శ్రీ విఘ్నేశ్వర ఆలయం : సత్యవేడుకు తూర్పు తిరువళ్లూరు మార్గంలో శ్రీ విఘ్నేశ్వరాలయం వెలసివుంది ఇక్కడ వినాయకుడి మూల విరాట్టు గలదు. శైవాగమ ప్రకారం పూజలు జరుగును. వినాయక చవితి ముఖ్యమైన పండుగ.

శ్రీ కోదండరామస్వామి ఆలయం : సత్యవేడు సమీపంలో గల రాజానగరంలో శ్రీ కోదండరామస్వామి ఆలయం నందు వైష్ణవాగమం ప్రకారం ఇక్కడ నిత్యపూజలు బీదలకు అన్నదానం జరుగును శ్రీ పులిగంటి సుబ్బరాయుడుగారు యీ దేవాలయాన్ని నిర్మించినట్లు తెలస్తుంది. ఇక్కడ శ్రీరామనవమి వైభవంగా జరిగే పర్వదినం దీనికి దగ్గరలోనే శ్రీ దర్మరాజస్వామి దేవాలయం కూడా వైష్ణవాగమం ప్రకారం పూజలు ఆగస్టు మాసాల్లో ధర్మరాజు ఉత్సవాలు జరుగును.

శ్రీ వళ్లికొండేశ్వరస్వామి ఆలయం : తిరుపతి ఊతుకోట-మద్రాసు మార్గ లో సురుటుపల్లెలో అతి పురాతనమైన ప్రసిద్ధి గాంచిన శ్రీ వళ్లికొండేశ్వరస్వామి ఆలయం గలదు, స్థలపురాణము దృష్ట్యా ఎంతో పేరు ప్రఖ్యాతులున్న దేవాలయం ఈ క్షేత్రము అపర రామేశ్వరమని పేరుగాంచినది. పురాణాలుభట్టి క్షీరసాగర మధనంలో వెలువడిన హాలాహలాన్ని మింగిన పిమ్మట ఆ బాధను తగ్గించుకొనేందుకు పరమేశ్వరుడు పార్వతి దేవి వడిలో శయనించివున్నట్లున్న విగ్రహం దేశంలోనే మరెక్కడ లేదనీ తెలుస్తుంది.

ఇక్కడ రామలింగేశ్వరస్వామి శ్రీ రామచంద్రునిచే ప్రతిష్ఠింపబడెనని ప్రతీతి. ఇదిగాక వాల్మీకిమహర్షి పూజించిన స్వయంభూలింగం మాతృమూర్తి ఆలింగనం చేసుకొన్న దక్షిణామూర్తి విగ్రహం ఇక్కడ ప్రత్యేకతలు శ్రీశ్రీ శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు కుంభాభిషేకం కూడా జరిపించారు, ఇక్కడ శైవాగమం ప్రకారం పూజలు జరుగుతాయి శివరాత్రి మహావైభవంగా జరుగుతుంది ఈ క్షేత్రాన్ని భక్తకోటి విశేషంగా ఆకర్షించే పుణ్యస్థలంగా వెలుసివుంది.

శ్రీ కాళహస్తీశ్వరస్వామి దేవాలయం : అతి ప్రాచీనమైన పుణ్య క్షేత్రాలలో శ్రీ కాళహస్తీశ్వర దేవాలయం శైవక్షేత్రాలలో ప్రసిద్ధి గాంచినది శ్రీ కాళహస్తి పట్టణంలో వుంది. తిరుమల-తిరుపతి శ్రీ వెంకటేశ్వరుని దర్శించినవారు శ్రీ కాళహస్తీశ్వరుని దర్శించకుండా వెళ్లరు. దీనిని దక్షిణ కాశి అని కూడా పేరుంది. ఇది ప్రముఖ యాత్రా స్థలంగాను వుంది. శ్రీ కాళహస్తి పట్టణం ఉత్తరదిశలో దుర్గాంబ కొండ-దక్షిణ దిశలో కన్నప్ప కొండ గలదు. ఇవి రమనీయమైన ప్రకృతి, శిల్ప సంపదలతో అలరారే

యీ ఆలయం అత్యంత ప్రాచీనమైనది ఈశ్వరుడు సాలిపురుగు, ఏనుగు, పాములకు మోక్షాన్ని ప్రసాదించిన పావన పుణ్యభూమి యిది ఇచ్చట శివ లింగం స్వయంభువు ఎన్నో చారిత్రార్థకమైన పురాణాలు ఈ సర్వేశ్వరుని గూర్చి కొనియాడిన సంఘటనలున్నాయి. ఈ ప్రాంతం క్షేత్రాల పేర్లు దీని యొక్క పురాతను, పవిత్రతను వెలుగెత్తి చాటుతున్నాయి.

ఈ పవిత్ర క్షేత్రంలో శివసాయుజ్యం నొందిన భక్తులందరిలోకి భక్తకన్నప్ప అనబడే తిన్నడు అగ్రగణ్యుడు ఇతని కథ అందరికి తెలిసినదే క్రీ. పూ. 3వ శతాబ్దంలోనే ఈ ఆలయం వున్నట్లు చారిత్రక ఆధారాలు న్నాయి. పల్లవరాజులు క్రీ శ. 9వ శతాబ్దంలో దేవాలయాన్ని నిర్మించారు. చోళులు, విజయనగరరాజులు వాటికి మెరుగులుదిద్దారు శైవాగమం ప్రకారం ఇక్కడ నిత్య పూజలు జరుగుతాయి ప్రతి సంవత్సరం శివరాత్రి 12 రోజులుపాటు అతివైభవంగా ఉత్సవాలు జరుగుతాయి. నిత్యం భక్తుల సందడితో యీ పవిత్ర క్షేత్రం పావనం చేసే పుణ్య స్థలంగా వుంది. యాత్రీకులకు అన్నివసతులు గల్పించేందుకు ఆలయపాలనకు అధికార అనధికార కమిటీ కూడా వుంది.

శ్రీ ప్రసన్న వరదరాజస్వామి దేవాలయం : శ్రీ కాళహస్తీ పట్టణం లో పేరెన్నికగన్న శ్రీ ప్రసన్న వరదరాజ స్వామి దేవాలయం కూడా గలదు. ఇది శ్రీ కాళహస్తీశ్వర దేవాలయానికి ఉత్తరదిశలోవుంది ఆనాడు శ్రీ కాళహస్తి జమీందారు అనేక సౌకర్యాలు కల్పించిరి. ధనుర్మాసము, వైకుంఠ ఏకాదశి మొదలైన ఉత్సవాలు పాంచరాత్ర ఆగమాన్ని అనుసరిస్తు పూజలు చేస్తారు

శ్రీ ధర్మరాజుస్వామి దేవాలయం : శ్రీకాళహస్తికి తూర్పుదిశలో శ్రీ ధర్మరాజస్వామి దేవాలయం కూడా చాల ప్రసిద్ధిగాంచినది ఇక్కడ ప్రతి సంవత్సరం అతి వైభవముగా బ్రహ్మోత్సవాలు వేడుకలు జరుగుచుండును, ప్రత్యేకించి అగ్నిగుండం విశేషమైనది.

తిరుపతి రేణిగుంట మార్గంగుండా వెళ్తే 15 కి.మీ. దూరంలోవున్న పాపానాయుడు పేటలో కూడా శ్రీ ధర్మరాజస్వామి దేవాలయం గలదు. ఇక్కడ జూలై ఆగష్టు మాసాలలో జరిగే ఉత్సవాలు ప్రత్యేక ఆకర్షణలు వైష్ణవాగమం ప్రకారం పూజలు జరుగును.

శ్రీ పరశురామేశ్వరస్వామి ఆలయం : రేణిగుంట-పాపానాయుడు పేటకు సమీపంలోని గుడిమల్లం గ్రామంలో వున్న శ్రీ పరశురామేశ్వర ఆలయం అతి ప్రాచీనమైనది. ప్రసిద్ధమైనది. ఈ ఆలయంలోని శాసనాల వలన దీనిని చోళుల కాలంలో నిర్మించినట్లు తెలుస్తున్నది శ్రీ కాళహస్తీ వాయులింగానికి ఇక్కడ శివలింగమే మూలవిరాట్టు అని వాడుకలో వుంది. పరమశివుడు ఇక్కడే వాయుదేవునికి ప్రత్యక్షమై పుత్రభిక్ష పెట్టినాడని తన భక్తుడైన చిత్రసేనుడనే రాక్షసరాజుకు మోక్షాన్ని ప్రసాదించినారని భక్తుల విశ్వాసము శైవాగమం ప్రకారం పూజలు జరుగును ఈ ఆలయం యొక్క పుల్యాపరాలు పరిశోధించేందుకు ప్రభుత్వ పురావస్తు పరిశోధనాశాఖవారి ఆధీనంలోవుంది. ప్రస్తుతం బస్సు రాకపోకల సౌకర్యం గలదు. ప్రాచీనమైన దేవాలయం అయినప్పటికి దీనికి యింకా అంతప్రాముఖ్యత రాతకొవడానికి దీని యొక్క ప్రాముఖ్యత ప్రచారంలో లేకపోవడం ప్రధానకారణమైనది. ఈలాంటి దేవాలములెన్నో ప్రాచీనతను సంతరించుకొన్న ప్రచారలోపంతో మరుగుననున్నాయి.

శ్రీ అయ్యప్ప దేవాలయం : తిరుపతి - పుంగనూరు మార్గం కల్లూరు దక్షిణ దిశలో నున్నసమం సమీపంలో వెలసివున్న శ్రీ అయ్యప్ప దేవాలయం ఎర్రాతివాండ్లపల్లె ఎత్తైన బండపై నిర్మించబడినది. ఈ దేవాలయం శ్రీ రామచంద్రారెడ్డిగారి స్వయంకృషితో నిర్మించిన ఆలయం ఎంతో ప్రసస్తమైనది ఇక్కడ పూజ వేడుకలు అందరిని ఆకర్షించడం ప్రత్యేక విశేషం.

శ్రీ కళ్యాణ వెంకటేశ్వర ఆలయం : తిరుపతి రేణిగుంట మార్గ మధ్యలో రైల్వే క్వార్టర్స్ రిపేరు వర్క్‌షాపు పడమర బాగంలో అధునాతనమై శ్రీ కళ్యాణ వెంకటేశ్వర ఆలయం నెలకొల్పబడివుంది. ఈ ఆలయం చుట్టు ప్రక్కల గల గ్రామీణ ప్రాంతకు సైతం అందుబాటులో వుంటు పూజలు జరగడం విశేషం.

శ్రీ వీరాంజనేయ, భక్తాంజనేయ ఆలయాలు: తిరుపతి శ్రీ కాళహస్తి రహదారి మార్గమధ్యలో ఎదళ్లచెరువు, ఏర్పేడు సమీపంలోను ఆంజనేయ ఆలయాలు నిర్మించి ప్రతి యేట హనుమాన్ జయంతి ముఖ్యమైన పండు

గలలో ఉత్సవాలు, వేడుకలు అతివైభవముగా యాత్రికులను ఆకట్టుకొనే విధంగా జరగడం విశేషం.

ఆశ్రమ అలయాలు శ్రీ వ్యాసాశ్రమం : ఆంధ్రదేశంలో అత్యంత ప్రాముఖ్యత ప్రసిద్ధిగాంచిన పవిత్ర పుణ్యక్షేత్రంలా శ్రీ వ్యాసాశ్రమం ఏర్పేడు సమీపంలో గలదు ఈ ఆశ్రమాన్ని 1926 సంవత్సరములో శ్రీ సద్గురు మలయాలస్వాములువారు నిర్మించారు. జాతి విచక్షణలేకుండా స్త్రీ, పురుషులకు సమానంగా వేదాలను బోధించి, ఆధ్యాత్మిక తత్త్వాన్ని వటవృక్షంలా వ్యాపింపజేసి ఆంధ్ర నలుమూలల్లో జ్ఞానబోధన చేస్తున్న ఆశ్రమం ఒక మహోన్నతమైన విజ్ఞానాలయం ఈ ఆలయంలో ఆధ్యాత్మిక విద్యను, సంస్కృత విద్యను ఆదర్శవంతంగా బోధించడం ఆలయం ప్రసా దింస్తున్న జ్ఞానమార్గాలు వెలుగుజ్యోతులు నిలయమైవుంది

శ్రీ శుకబ్రహ్మాశ్రమం : శ్రీ కాళహస్తీశ్వర దేవాలయానికి నైఋతి భాగంలో శ్రీ శుకబ్రహ్మాశ్రమం శ్రీ మలయాళస్వాములవారి శిష్యులు శ్రీ విద్యాప్రకాశనందస్వాములవారిచే నిర్మించబడినది. ఇక్కడ నేత్ర ఉచితవైద్య శాల పేదపిల్ల పాఠశాల నిర్వహిస్తు - ఆత్మజ్ఞాన ప్రబోధములో అగ్రశ్రేణిలో వుంది ప్రశాంతమైన ఆధ్యాత్మిక వాతావరణం ఇక్కడ ప్రత్యేకత.

శ్రీ తపోవనం : చిత్తూరు పట్టణం గిరింపేట మార్గంలో తపోవనం వెలసివుంది. ఇక్కడ శ్రీ మళయాలస్వాములవారి వ్యాశ్యాశ్రమం అధ్వర్యం లో జ్ఞానబోధలు జరుగుచుండును పాఠశాలకూడా నిర్వహించుచున్నారు.

శ్రీ రామకృష్ణ ఆశ్రమం : పాకాల పట్టణంలో శ్రీ రామకృష్ణాశ్రమం నెలకొల్పబడివుంది. ఈఆశ్రమం శ్రీ రామకృష్ణ పరమహంస శారదా దేవి స్వామి వివేకానంద బోధనలు ప్రచారంలో లోకకళ్యాణానికి ప్రజల్లో ఆధ్యాత్మిక చింతకల్గించే కార్యక్రమాలు నిర్వహించడం విశేషం,

మరికొన్ని విశేషాలు : ఈ జిల్లాలో దేవాలయాలు, విద్యాలయాలు విజ్ఞానానికి, భక్తికి నిలయాలు-వీటితోమరెన్నో ప్రకృతి ప్రసాదించిన రమ ణీయమైన దృశ్యాలకు నిలయమైనది. చిత్తూరు జిల్లా విజయనగరరాజుల

నిర్మించిన చంద్రగిరికోట ఒక ప్రముఖ యాత్రాస్థలమైంది. జిల్లాలో అనేక మైన ప్రముఖ స్థలాలు హార్సిలీహిల్సు మరో ఊటీ - పేరు గాంచినది అట్లే తలకోన, కైలాసనాదకోన, సదాశివకోన సిద్ధులయ్యకోన, దుముకురాళ్లు, మనసుకు ఆహ్లాదకరంగా ఉల్లాసంగా, ఉత్సాహాన్ని శాంతిని, ప్రశాంతిని కల్గించే ప్రదేశాలుగా ప్రజలకు అందుబాటులో విరామసమయాలలో విహార యాత్రలకు అనువుగా వున్నాయి. వీటిని సందర్శించడానికి ద్విచక్రవాహనాలు బస్సులు రాకపోకలు సౌకర్యాలు మెండుగావున్నాయి.

ఈ యొక్క ప్రాంతాలు పరిశీలించినట్లయిన ప్రముఖమైనది తిరుపతి పట్టణానికి సమీపంలోని కపిలతీర్థం, కొండలనుండి ప్రవహించే జలపాతం చూడడానికి ఎంతో మనోహరంగా హాయిగా ప్రశాంతతను కల్గించే వాతావరణం ప్రతి యాత్రికులనేగాదు తిరుపతిపట్టణ ప్రజలను ఆకర్షించుకొంటున్నది

తలకోన : తిరుపతికి పశ్చిమాన నెరబైలు సమీపంలో తలకోన జలపాతం వుంది. తిరుపతిలోని ఏడుకొండలకు ఈ తలకోన గడపవంటిదని చెప్పవచ్చును. ఈ తలకోన వాగులో సిద్దేశ్వర తీర్థమనే జలపాతం గలదు పది కిలోమీటర్ల సమీపంలోని కొండలమధ్య నున్న వేయి లింగాలకోనలో ఈ నదీ జలాలు ప్రవహిస్తుంటాయి. ఋతువులతో సంబంధం లేకుండా సంవత్సరం పొడవునా ఈ జలపాతాల సందర్శనకు వచ్చేవారికి కనులవిందుగా చేస్తుంది.

దుముకురాళ్లు : జిల్లాలోని పలమనేరు - కుప్పం మధ్యనున్న బైరెడ్డిపల్లె సమీపంలో రహదారి నుండి ఏడు కిలో మీటర్ల దూరంలో కైగల్‌ఫాల్స్ అనే దుముకురాళ్ల జలపాతం వుంది. ఇది అటవీప్రాంతం వుండడం విశేషం. సందర్శకులు యీ ప్రాంతాన్ని సందర్శిస్తుంటారు.

సిద్దలప్పకోన : సత్యవేడు ప్రాంతంలోని వరదయ్యపాళెం గ్రామానికి 12 కి. మీ. దూరానవున్న అడవుల-కొండల మధ్య నుండి శిలయేర్లు పారుతుంటాయి. ఈ కోన చుట్టు ప్రక్కల వారికి ఎంతో హాయిని గొలిపే విహారముగావుంటు ప్రశాంత వాతావరణం కల్గు చేస్తుంటుంది.

సదాశివకోన : పుత్తూరు సమీపంలోని సదాశివకోన జలపాతం ఎత్తైన కొండలపై నుండి వచ్చే జలపాతం ప్రశాంత వాతావరణానికి కలుగ జేయడం వలన యిక్కడికి దూరప్రాంతాలనుండి తమిళనాడు నుండి అనేక మంది విహార యాత్రలు చేస్తు ఆనందిస్తు టారు.

కైలాసకోన : తిరుపతి-పుత్తూరు నాగలాపురం మార్గంలో రహదారి నుండి తూర్పుదిశగా నున్న ఈ కోన అందచందాలు చూత ఆహ్లాదకరంగా చూడు వినోదకరంగా విశ్రాంతికి నెలవైన ప్రాంత గా ఇక్కడ జలపాతం. సహజ సిద్ధమైన కోనేరు శివపార్వతుల ఆలయాలు భక్తులకు ఆనంద నిలయాలుగా యాత్రాస్థలంగా కైలాసనాదకోన యింకా రూపుదిద్దుకోవలసివుంది

చిత్తూరు జిల్లా ప్రాంతం అడవులలో కొండలతో హెచ్చుబాగం, కను మలలో కలసివుంది. ఈ ప్రాంతం చుట్టుప్రక్కల పశ్చిమాన కర్నాటక కోలారు జిల్లా దక్షిణాన నార్తాఆర్కాడ్, ధర్మపురి జిల్లాలు ఉత్తరాన కడప జిల్లా తూర్పున నెల్లూరు జిల్లాలు సరిహద్దుగా వున్నాయి.

ఈ ప్రాంతాన్ని నవీ శిలాయుగం నుండి మానవులు నివసించ నట్లు అక్కడక్కడ కనిపించు పాండవ గుళ్ళవలన విశ్వసించబడుచున్నది ప్రాచీన చరిత్రకారులు టాలిమీ ప్లినీ వారి వ్రాతప్రతులను బట్టి కోరమండళమునుచేరిన ఈ ప్రాంతం క్రీ శ. 1వ శతాబ్దానికే జనవాసమైనట్లు తెలియుచున్నది.

ఈ జిల్లా క్రీ శ. 3 శతాబ్దంలో పల్లవుల రాజ్యపాలన క్రిందవుండేది కొన్నేండ్ల తరువాత చోళులు యీ జిల్లా ప్రాంతాన్ని ఆక్రమించి చోళరాజ్య ములో కలుపుకొనిరి. చోళరాజులు అనేక సవత్సరాలు యీ ప్రాంతాన్ని పాలించిరి ఆ విధంగా చోళరాజులు కొన్ని శతాబ్దాలు తమ పాలన చేసిరి. క్రీ శ. 12వ శతాబ్దములో రాజేంద్రుడనే చోళరాజు శ్రీకాళహస్తీశ్వరాల యాన్ని నిర్మాణం చేసెను. ఆనాటి చోళుల రాజ్యపరిధిలోని కంచి నుండి ఆంధ్ర దేశాన్ని పలు సంవత్సరాలు పాలించెను.

కాని క్రీ శ. 13వ శతాబ్దాములో చోళుల రాజ్యం అంతరించెను. అటుతరువాత చిత్తూరు ప్రాంతాన్ని కొన్నేళ్లపాటు యాదవరాజులు పరిపాలన సాగించిరి.

స్థానికరాజులలో ఒకడైన 'అక్కరాజు' కుమార్తెయగు పద్మావతిని తిరుపతి వెంకటేశ్వరులు పెళ్లిచేసుకొన్నాడని ప్రతీతి చెందినది. చోళులకు సామంతునిగా వున్న యాదవరాజులు జిల్లాలోని చంద్రగిరి ప్రాంతమును పాలించిరి. యాదవరాజైన 'ఇమ్మడి నరసింహుడు' క్రీ. శ. 10వ శతాబ్దములో చంద్రగిరి కోటనుకట్టించెను. చోళుల ప్రతిభ రానురాను సన్నగిల్లిన తరువాత యాదవరాజులు స్వతంత్రులై 'నారాయణవనము' కేంద్రముగా పాలించారు.

క్రీ శ. 1324లో డిల్లీ సుల్తాన్ అల్లావుద్దీన్ ఖిల్జీసేనలు దండెత్తి యీ ప్రాంతమును కైవసం చేసుకొనెను. కానీ డిల్లీ సుల్తానుల పాలన ఎక్కువకాలం జరగలేదు, వీరిపాలనను దిక్కరించి హరిహర బుక్కరాయలు అను సోదరులు స్థాపించిన విజయనగర సామ్రాజ్యంలో చిత్తూరు జిల్లా కలిసిపోయింది. కాళహస్తి జమీందారులు విజయనగరరాజులకు సామంతులుగా ఉంటూ చిత్తూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలను పాలించిరి

విజయనగర రాజ్యపతనానంతరము శ్రీరంగరాయలు చంద్రగిరిని రాజదానిగా చేసుకొని కొంతకాలం పాలించిరి యాదవరాజైన ఇమ్మడి నరసింహుడు కట్టించిన చంద్రగిరి కోటను విజయనగర రాజుల కాలంలో కట్టుదిట్టం చేసి నిర్విఘ్నంగా పాలించిరి మూడవ శ్రీరంగరాయలు పరిపాలించుచున్న కాలంలో అతని అనుమతినొంది ఇంగ్లీషువారు మద్రాసులో కోటను నిర్మించుకొని అప్పటినుండి ఇంగ్లీషువారిపెత్తనం దక్షిణ భారతదేశానికంతట వ్యాపించింది.

అయితే 1646 సంవత్సరములో చిత్తూరు జిల్లా గోలుకొండ నవాబు వశమైంది. కడప నవాబు మదనపల్లె, వాయల్పాడు, పుంగనూరు తాలూకాలను జిల్లాలోని మిగత తాలూకాలను అర్కాడు నవాబును గోలుకొండ నవాబు అనుచరులుగా పరిపాలనసాగించిరి. తదుపరిగోలుకొండరాజ్యపాలన అంతమైనపిదప చిత్తూరుజిల్లాను కర్నాటక నవాబులుపాలించిరి. 1658లో అర్కాడు నవాబు తమ్ముడైన అబ్దుల్‌వాహెబ్‌ఖాన్ చంద్రగిరి కోటనుండి పాలించెను.

మహారాష్ట్రీలు ఆర్కాట్ నవాబ్ అయిన దోస్తు అలీఖాన్‌ను చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకా దామల్ చెరువు వద్ద చంపివేశారు వారి తరువాత మైసూరు పాలకుడైన హైదరాలీ చిత్తూరు జిల్లాను ఆక్రమించికొన్నేండ్లపాటు పాలించెను మైసూరు యుద్ధాలలో హైదరాలిని ఇంగ్లీషువారు ఓడించారు. 1792 సంవత్సరములో జరిగిన శ్రీరంగపట్నం సంధిప్రకారం మదనపల్లె వాయల్పాడు, చంద్రగిరి తాలూకాలు నైజామ్ నవాబుకును మిగతా తాలూకాలు ఆర్కాటు నవాబుకు ఇంగ్లీషువారు జిల్లాను పంచి ఇచ్చారు, ఆనాడు బ్రిటిష్ సైన్యాల ఖర్చుల క్రింద సైనిక సహకార పద్ధతిననుసరించి నైజాం నవాబు రాయలసీమ జిల్లాలతోపాటు చిత్తూరు జిల్లాను కూడా 1801 సంవత్సరములో ఇంగ్లీషువారికి కట్టబెట్టారు. ఆ తరువాత ఆనాటి పాలకుల ఆదీనంలోని కడప నుండి కలసిన చిత్తూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలను వేరు చేశారు. ఆంగ్లేయులు మిగతబాగాన్ని స్వాదీన పరచుకొని నార్త్ ఆర్కాడు నవాబు చనిపోయిన అనంతరం అతని తమ్ముడు కర్ణాటక ప్రాంతంమీద తన రాజ్యాధికారాన్ని అంగ్లేయులకు అప్పజెప్పి, ఆ ప్రాంతంలో వసూలయ్యే శిస్తులో తనకు ఏదోవంతు ఇస్తే చాలునని ఒప్పందం కుదుర్చుకున్న సందర్భములో కలసిన భూబాగమే చిత్తూరు ఆనాటినుంచి చిత్తూరు జిల్లాకు ప్రత్యేకత లభించింది.

ఈ విధంగా చిత్తూరు జిల్లా రూపుదిద్దుకొని రాను రాను అభివృద్ధి పథంలో నత్తనడక లాగా వచ్చింది. స్వాతంత్రనంతరము చిత్తూరు జిల్లా పరిపాలన రంగములో మెట్టు మెట్టుకు ఎదుగుతు దినదిన ప్రవర్తనాపరంగా అన్ని రంగాలలో అనుకొనంత ఆశించినంత అభివృద్ధి పథానా నడుస్తున్న దనడంలో అవరోదాలున్నా అధిగమిస్తునే వస్తున్నది.

చిత్తూరు జిల్లా ఒకప్పుడు చాలవరకు ఎడారిప్రాంతంగానే నిత్య కరువు కాటకాలకు నిలయంగా కరువు దేవత విలయతాండం చేస్తుండేది. రానురాను ప్రభుత్వం పరిపాలనపరంగా ప్రజాసంక్షేమ కార్యక్రమాలు నిర్వహించడంలో ప్రజల సహకారంతో - ప్రభుత్వ ప్రణాళిక ప్రగతిపథకాలు రూపుదిద్దుకొంటూ నేటికి జిల్లా సర్వతోముఖాభివృద్ధికి కావలసిన వనరులు సమకూర్చుకొని పాలన సాగించే స్థాయికి వచ్చింది.

అందుకుతోడు చిత్తూరు జిల్లా ప్రజలనాగరిక-సంస్కృతికను అంతకుమించి త్యాగధనం, ప్రేమ, భక్తి, ప్రవర్తులు గల్గిన మహనీయులు ఎ.దరో ఉద్భవింపడం వలన వారి అడుగుజాడల్లో నడవడంవలననే సత్‌సాంప్రదాయులకు పుట్టినిల్లుగా, భక్తినిలయాలుగా, వెలసిన విద్యా నిలయాలు యిచ్చిన జ్ఞాన ప్రవాహాన్ని పంచడంలో జిల్లా నేడు విశ్వవిద్యా కేంద్రాలుగానే గాక భక్తి కేంద్రాలుగా అనేక దేవుళ్లకు (అన్ని దేవుళ్లుఒక్కటే, వేరువేరుగా ఆలయాలు నిర్మించి పూజలు చేయడంలో తమ ఆధ్యాత్మిక తత్వాన్ని ఆదిశంకరుల నుండి పొందిన ప్రహ్లప్రసాదంగా భావిస్తూ విజ్ఞానాన్ని వెదజల్లే విధంగా ఆలయాల-ఆశ్రమాలు నెలకొనడం యీజిల్లా ప్రజలువున్న పుణ్యభూమిఅని చెప్పవచ్చును,

## యజ్ఞ యాగాలు

పురాణ చరిత్రలు – మనకు శిరోధారాలు - మహాభారతం నేర్పిన పాఠాలు – నేడు పాలనా వ్యవహారాలకు మూలమైనది.. ఆనాటి పురాణాల్లో జరిగిన యజ్ఞ యాగాలు పరిశీలించిన అవి ఆనాటికి సరిపోయేవే మోగాని నేటి యుగానికి అది ఏమాత్రం మార్గదర్శకంకావు అంశేగాని ప్రాచీనులపట్ల అప్పటి ఆరాధ్యులపట్ల విశ్వాసం పోతుందనే భయంలేక పోలేదు. నేటి ఆరాధ్యదైవాలుగా కొలచే శ్రీకృష్ణుడు సైతం సత్యపాలన్ లో తిరుగులేని చక్రవర్తి హరిశ్చంద్రుడు, ధర్మపాలనలో అధిగమించిన ధర్మరాజు కడకు మహాఋషులైన వశిష్ఠ విశ్వామిత్రులు సైతం యజ్ఞయాగాల పేరుతో జరిపిన సంఘటనలు సభ్యసమాజంలో మానవతా విలువలున్న నేటి భారతావనీ ఏ మాత్రం క్షమించదని చెప్పవచ్చును. కానీ ఆనాటి పరిస్థితులువేరు

భారతీయుల సాంప్రదాయం (ముఖ్యంగా హిందువుల) ప్రకారం సత్యాన్ని ధర్మాన్ని వీరావేశంగా వ్యక్తం చేయటంద్వారానే మన సంస్కృతి చరిత్ర తెలుసుకోగల మనేది చారిత్రికుల ప్రగాఢ నమ్మకం.

ఒకసారి గాని పురాణాలు తిరగవేసి చూచినట్లయితే ఆనాటి పాలన

లలో జరిగే రాజసూయ యాగాలలో సర్వంక్షత్రీయులపై తమ అధిపత్యానికి గుర్తుగా పాలన చక్రవర్తులుగాని రాజులుగాని సాటిక్షత్రీయున్ని బలి యివ్వడం-అనాటి అచారమైనది

మహాభారత ప్రముఖరాజు ధర్మరాజు ఇంద్రప్రస్థంలో పరిపాలిస్తున్నప్పుడు రాజసూయం చేశాడు. భారతంలో ప్రధానపాత్ర, సూత్రదారి, మాయదారి, అందరి అరాధ్యుడు అయిన శ్రీ కృష్ణుడు ఏ మాత్రము వెనుకాడక తాను చేసేదంతా లోక కళ్యాణానికే నని ఆ యజ్ఞం సందర్బములో సర్వుల సమక్షములో శిశుపాలుని తలనరికి వేశాడు.

దీనికి కారణం ద్వేషబావంతో - అహంబావంతో శిశుపాలుడు శ్రీ కృష్ణునిపట్ల చేసిన దూషణలు అవదులు దాటి మితిమీరి పోవటంతో యీ హఠాత్ పరిణామాలు సంభవించినట్లు మహాభారత పురాణాలు వెల్లడిస్తున్నది. అంతేగాదు మరోవిదంగా ఆలోచిస్తే శిశుపాలుడు శ్రీకృష్ణునిపట్ల వున్న ద్వేషాన్ని రెచ్చగొట్టే విదంగా చేసేవిదంగా సన్నాహాలు పన్ని శిశుపాలునిని సభకు అహ్వానించి ముందువేసుకొన్న పదకంప్రకారం శ్రీకృష్ణునిచే శిశుపాలునిని వదింపచేసి తాము చేసిన రాజ సూయయాగంలో చేయవలసిన నరమేధాన్ని పాండవ సమూహంచేయగలగారని చెప్పడానికి ఆదారాలు చూపారు

ఇదే రీతిగా అంతకుముందు కాలంలో సంబవించిన శునశ్శేపుని కథ కూడ ఇలాంటిదే అనవచ్చును. హరిశ్చంద్రుడు తనకుమారుడు రోహితుడిని రాజ సూయయాగంలో బలి యివ్వడానికి వరుణునికి వాగ్దానం చేస్తాడు. ఈ సందర్బములో పుత్రప్రేమ అడ్డురాగా, మాయోపాయంవల్ల శునశ్శేపుడనే పేద బ్రాహ్మణ యువకునిని బలియివ్వటానికి సర్వసన్నాహాలు పూర్తిచేస్తాడు అయితే ఆ బాలుని యదృష్టంచివరకు యజ్ఞాలలో వున్న విశ్వామిత్ర ఋషి దయాకారుణ్యంతో శునశ్శేపుడు బ్రతికి బయటపడుతాడు.

నాటి సమాజములో పురాణాల కాలంనాటి తీరుతెన్నులు రాజులు-రారాజులు-చక్రవర్తులు విజేతలు-తమచే పరాజితులందరిని నిశ్శేషంగా

వధించే వారు తృప్తిపడేవారు అంతేగాదు శత్రుశేషం ఉంటే ఏనాటికైనా ప్రమాదమనే భయం అంతకుమించు బాలంగా మిగిలిపోయే బానిసలను పోషించలేని నిస్సహాయత దీనికి ప్రధాన కారణాలుగా వు డేవి.

కానీ మహాభారతం కాలంనాటికి మారిన అవసరాలను మించిన అధి కాహారోత్పత్తి పెరిగింది. దానికి తీవ్రమైన బానిసవ్యవస్థ ఏర్పడినది అయితే ప్రాచీనాచార అవశేషంగా నాటి రాజులు తమకు ఎదురులేదు అనే బాల దర్పం, ప్రదర్శనగా రాజసూయ యాగాలు చేసేవారు.

కాలమార్పు యుగమార్పు ఉపనిషత్తు జ్ఞానమార్గాలు ఆధ్యాత్మిక తత్వాలు బౌద్ధ జైనుల అహింసాబోధనలు- మారుతున్న మార్పుతో క్షత్రి యుల నిరసనతోడై రానురాను నరమేదయాగాలు యజ్ఞయాగాదు ఖపూర్తిగా అంతరిస్తూపోయాయి. దీనితో భారతజాతి సంస్కృతి - నాగరికత - విజ్ఞాన పథంలో మెట్టుమెట్టుకు పైకి ఎగబ్రాకడం ప్రారంభమైంది పశుప్రవృత్తిని, అమానుష మానవప్రవృత్తి ఛేదించుకొని మానవత్వ బాటలో సుఖశాంతులతో సుఖ ప్రయాణానికి-జీవనానికి వెలుగు ఏర్పడింది.

ఈ దృష్టితోనే చరిత్రను ఉన్నది ఉన్నట్లు అధ్యయనం చేయాలి. మానవసమాజంలో భక్తి ద్వేషాలకు అతీతంగా వస్తుగత చారిత్ర దృష్టిని అలవరచుకొనేందుకు ఎందరో మహనీయులు రచయితలు రచనలు చేశారు.

ఆ మార్గంలో నేడు భారతావని వేదభూమిగా మారింది. యావత్ ప్రపంచాలకు ఆదర్శనీయంగా పథంలో నిలచిపోయింది ఆధ్యాత్మిక రంగా న్ని వేదాంత సారాలతో భక్తి విశ్వాసాలను పెంచుతున్నది. కొంతవరకు నాటి పురాణాలు సైతం కొంతమేరకు దోహదపడిందని కూడ చెప్పకతప్పదు కన్యాకుమారి నుండి కాశ్మీర్ వరకు సింహాళం నుండి హిమాలయాల వరకు జ్ఞానయజ్ఞాలు అయితేనేమి, సత్యశాంతి ధర్మ సంస్థాపనకు యజ్ఞాయాగాలు సైతం జరగడం విశేషంగా వున్నాయి.

ఈ కోవకొనే ప్రపంచానికి, భారతానికే వైకుంఠ నిలయంగా నున్న తిరుమల తిరుపతి దివ్య క్షేత్రంలో అప్పుడప్పుడు మానవకళ్యాణానికి తరచు యజ్ఞాయాగాలు జరగడం విశేషంగా వుంది, భారతదేశం యావత్తు నెలకొని వున్న ఆలయాలలో భక్తి ప్రవర్తులతో కూడిన విదంగా లోకక్షేమానికి మానవ సౌభాగ్యానికి వరుణయజ్ఞాలు జ్ఞానయాజ్ఞాలు–గీతాయజ్ఞాలు, హోమములు అర్చనలు విరివిగా జరగడం సాంప్రదాయమైనది.

గత కొన్ని సంవత్సరాల నుండి యీ వేదభూమిలో పవిత్ర క్షేత్రంలో జరిగిన యాగములో చెప్పుకోదగిన శ్రీ యాగం భక్తులపాలిట కామధేనువుగా నిలచింది. ఈ యాగం నిర్వహించిన శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయరుస్వామి నుడిచినట్లు శ్రీ అంటే సంపద, శ్రీ యాగం అంటే సంపదను కూర్చే యాగం. సంపద అంటే కేవలం ధనం మాత్రమే గాదు. సంపద అనేవి పలురకాలు, ధనం, ఆరోగ్యం, బంధువులు, ఆత్మీయులు, స్నేహితులు, పాడిపశువులు, శరీరం ఇలాఎన్నోరకాలుగా సంపదలు వున్నాయి ఇలాంటి అన్ని రకాల శ్రేయస్సు కోసం చేసేదే శ్రీ యాగం అని అన్నారు.

తిరుపతి క్షేత్రం భాగంగానున్న తిరుచానూరులో ఆమధ్య జరిగిన శ్రీ యాగం తిరుచానూరు అమ్మవారి సన్నిధిలో పవిత్ర వేదఘోషలతో మంత్ర స్వరాలతో ఆగమోక్త విదానంగా శ్రీ యాగం జరిగింది. యాగకర్త సెలుపరికిస్తే శ్రీఅంటే లక్ష్మీ, సాక్షాత్తు అమ్మవారేలక్ష్మీ, అలుమేలుమంగ అని కూడ భక్తజనకోటి ఈ శ్రీమాతను సంబోదిస్తారు. అలర్అంటే పద్మ, మేల్ అంటే ఆ యొక్క పద్మంలో పుట్టిన, మంగొఅంటే లక్ష్మీ, అలర్మేల్మంగై అంటే పద్మం నుండి పుట్టిన లోకమాత పద్మావతిదేవి,

పద్మం అంటే భారతీయ సాహిత్యంలో వికసన శక్తికి ప్రతీక. బిడ్డలకు హృదయవికాసం, బుద్ధి వికాశం కలిగించే జగజ్జననిగా పద్మావతీ దేవిని భావింపవచ్చు. 'హృత్పుండరీక మధ్యస్థాంప్రాత స్సూర్యసమప్రభాం' అని దేవ్యుపనిషత్తులో చెప్పబడివుంది. అంటే ప్రతి జీవుని హృదయపద్మం

లోనూ పద్మనివాసినియైన అశ్రీదేవి ఉదయ సూర్యకాంతులతో విరాజిల్లుతూ వుంటుంది ఆ దేవి కృపా కటాక్షానికి పాత్రుడైనపుడే ఎవరి హృదయపద్మంలోనైనా జ్ఞానమకరందాలు జాలువారుతాయి ఆ దేవి కటాక్షం కోసం, అనుగ్రహం కోసం సంకల్పించిదే శ్రీయాగం,

సాక్షత్ శ్రీ వెంకటేశ్వరస్వామి కైనా సరే పద్మ సంభవయైన పద్మావతీ కటాక్షం లేకపోతే వైభవం లేదు. త్రిమూర్తులలో సత్వగుణ సంపన్నుడు, సంయమనశీలుడైన భగవంతుడెవరో తెలుసుకోవడానికి భృగుమహర్షి బయలుదేరాడు శివుడు, బ్రహ్మ ఆయన పరీక్షకు నిలువ లేకపోయారు. వైకుంఠంలో లక్ష్మీ సమేతుడై వున్న శ్రీ మన్నారాయణుని వద్దకు వెళ్ళాడు. స్వామి వక్షఃస్థలంపై పాదతాడనం చేశాడు మహర్షులంతా ఆయన బిడ్డల వంటి వారేకదా? పసిబిడ్డలు తెలిసో తెలియకో పాదతాడనం చేస్తే తల్లిదండ్రులు కోపిస్తారా?–కోపించరు, అలాగే విష్ణుమూర్తి కోపించ లేదు, కాని విష్ణుమూర్తి వక్షఃస్థల వాసియైన శ్రీదేవికి అనన్నివేశం ఆగ్రహం కల్గించింది. ఆ లోకమాత స్వామిపై కోపించి వైకుంఠం నుండి భూలోకానికి వచ్చేసింది. దేవిని వెతుక్కుంటూ స్వామి వచ్చాడు సువర్ణముఖీ నది తీరంలో పద్మ సరస్సువద్ద అమ్మవారిని ప్రసన్నం చేసుకోవడానికి తపస్సు ప్రారంభించాడు. పద్మ సరస్సులో ఒక పద్మం నుంచి దేవి సముద్భవించింది. స్వామిమెడలో పుష్పమాల అలంకరించి తన ప్రసన్నత వ్యక్తం చేసింది అప్పుడు లక్ష్మీ సమేతుడై అనన్యతేదోవిరాజితుడైనట్లుగా పద్మపురాణం పేర్కొన్న ఆ పద్మ సరస్సే తిరుచానూరులో మనం చూస్తూ వున్న పుష్కరిణి.

శ్రీదేవి శ్రీమన్నారాయణునితో గూడా బంగారు కమలాలలో ఈపద్మ సరస్సులో దేవతలకు సాక్షాత్కరించి, సమస్త శుభాలూ ప్రసాదించినట్లు వరాహ పురాణంలో 9వ అధ్యాయంలో పేర్కొనబడి వుంది.

'స్థితాం సువర్ణ కమలే
పుండరీకాక్ష సంయుతాం,
దృష్ట్వా ప్రీతి సమాయుక్తాః
ప్రణమ్యాంబుజ ధారిణీం

ఈ విధంగా ఇంద్రాది దేవతలకు ప్రత్యక్షమైన అశ్రియం దేవిని దెవతలు స్తోత్రం చేశారు. అప్పుడా దేవి పద్మ సరస్సు తీరంలో తనను స్తోత్రం చేసి అర్చించిన వారికి తాను సమస్త ఐశ్వర్యాలు ప్రసాదిస్తానని చెప్పినట్లుగా కూడ వరాహ పురాణంలో ఆ సందర్భంలోనే పేర్కొనబడి వుంది.

'తేపి శ్రియం దీర్ఘమాయుః
విద్యాం పుత్రాన్ సువర్చసః
లబ్ధ్వా భోగాంశ్చ భుక్త్వాన్తే
సదా మోక్షమవాప్నుయుః

అంటే సమస్త మానవాలి సిరిసంపదలతో, దీర్ఘయుష్మంతులై, విద్యామూర్తులై, తేజోనిధులై విరాజిల్లాలి–అంటే ఇక్కడి శ్రీమాతను అర్చించాలి. 'శ్రీయాగం' నిమిత్తంగా ఇక్కడ లోకమాతకు మనంచేసిన సేవకూడా అన్ని సత్ఫలాలు కలిగిస్తుందనడంలో సందేహం లేదు.

"ఈశానాం జగతోస్య వేంకటపతే
ర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షఃస్థల నిత్యవాసరసికాం
తత్క్షాంతి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవయుగాం
పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం
భగవతీం వందే జగన్మాతరమ్"

"మత్ప్రాప్తిం ప్రతి జన్తూనాం సంసారే పతతామధః
లక్ష్మీమేష పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః
మమాపి మతం హ్యేతత్ నాన్యథా లక్షణం భవేత్"

# యాగ ఫలితాలు

## శ్రీ యాగం విశ్వశాంతి యాగం

యజ్ఞ యాగాదులు నిర్వహించడంలో విశేషం మానవుని విజ్ఞానాన్ని మేధాశక్తి పెంపొందింప చేస్తుంది. భక్తి విశ్వాసం, శాంతి సంస్కృతి-నాగరికద సాంప్రదాయలు పెంపొందుతుంది. నైతిక విలువలు విస్తరిస్తాయి. యజ్ఞం నిర్వహించడం ఒక పవిత్ర ధర్మమైతే-అందులో పాల్గొని భాగస్వామి కావడం మానవ విశిష్టతకు ప్రతిబింబం అనికూడ చెప్పవచ్చును.

అది శ్రీయాగ వాటిక, భక్తిముక్తుల యజ్ఞపీఠిక. అది విశ్వశాంతి చతుర్వింశతి (24) కుండాత్మక యాగ భూమి. శ్రీసూక్త, భూసూక్త, నీలా సూక్తాల గానఝురులు హొంగిపొరలి సంగమిస్తున్న ప్రయాగభూమి. త్రికాల సంధ్యల్లో అక్కడ వేదసూక్తాలు సాగుతున్నాయి. ప్రాణికోటికి శుభాల్ని సంకల్పిస్తూ అక్కడ హోమజ్వాలికలు రేగుతున్నాయి. అది శ్రీయాగ పంచాహ్నిక. సకల వేదసార స్వరముఖరిత గానపేటిక!

ప్రకృతి ప్రతిరూపం శ్రీమాత. ఆమె శ్రీ మహారాజ్ఞి. ఆ శ్రీమతి ఒహో సర్వేశ్వరిని ఆరాధించడమే శ్రీయాగం. వాచకరూపంలో జరిగే ఆరాధనని స్తోత్రం అంటాం. కాయిక రూపంలో అంటే శారీరకంగా జరిపే పూజను అర్చన అంటాం. మానసిక శక్తితో నిర్వహించే ఉపాసనను ధ్యానం అంటాం. ఈ మూడు ప్రక్రియలూ త్రివేణీ సంగమంలా ముప్పేటగొన్న విధానాన్నే మనం యాగంఅంటున్నాం. ఇప్పుడు జరుగుతున్న శ్రీయాగంలో అమ్మవారిని వాచిక, కాయిక, మానసిక శక్తులతో ఉపాసించడం జరుగుతోంది.

చిదగ్నికుండ సంభూత అయిన అమ్మవారు ప్రకృతికి ప్రతిరూపం-ప్రకృతి ఒడిలోనే ప్రాణికోటి శ్వాసిస్తోంది చరాచర జగత్తు ఆమె సంతానం. సంతతి చల్లగా వుండాలంటే అమ్మ కరుణ అవసరం అందుకే ఆమెను

ప్రేమతో ఆరాధించడం అమె ప్రకృతికి మూల స్వరూపిణి. అమె ఒక మహా సృష్టి, సంకల్ప వృక్షం. ఆ మహావృక్షం మూలంలోని పాదుని సవనధారలతో స-ల సంభరితం చేయడమే ఈ శ్రీయాగంలోని ఆంతర్యం. అంటే ఈ సృష్టి పది కాలాలు పచ్చగా పుష్టించి, ఫలించి సర్వప్రాణికోటికి ఆశ్రయంగా అశ్రమంగా వుండాలనే సదాశయంతో చేసే కార్యం ఇది. ఈయాగభూమిలో సమర్పింపబడుతున్న అశ్రీమాతా మహావృక్షం మొదట నింపుతున్న జలాలతో సమానం.

శ్రీయాగాన్ని పూర్వం నైమిశార్యరణ్యసుందర సీమల్లోనూ, పవిత్ర గంగా తీర భూముల్లోనూ వింధ్య పర్వత సాను సమీపాల్లోనూ, మహిమాన్విత హిమవత్పర్వత ప్రదేశాల్లోనూ భూమి పాలకులు నిర్వహించినట్లు పురాణాలు చెబుతున్నాయి ఇంద్రుడు సర్వదేవతల సంక్షేమం కోసం, శుక్రాచార్యుడు తమ శిష్యవర్గ అభ్యుదయం కోసం శ్రీదేవి అనుగ్రహాన్ని కాంక్షించి ఈ యాగాన్ని చేసినట్టు చెబుతాం.

శ్రీదేవిని వేదంలో గాయత్రీ స్వరూపంగా ప్రతిపాదించారు ఈగాయత్రికి పరమాత్మ అదినుడై వుంటాడు, ఈ గాయత్రీ మహామంత్రానికి 24 అక్షరాలుంటాయి ఒక్కో అక్షరానికి ఒక్కో హెూమ కుండం ప్రతీక అవుతోంది. అందుకే ఈ శ్రీయాగం చతుర్వింశతి కుండాత్మకం అయింది.

ఏ ఒక్క వ్యక్తి క్షేమం కోసమో చేసే యాగమైతే ఒక్క హెూమకుండం చాలు. కానీ ఇక్కడ సర్వమానవులే కాదు, సర్వప్రాణులేకాదు, సర్వ ప్రకృతికి సుఖశాంతుల్ని కోరిచేస్తున్న యాగం ఇది. అందుకే ఈ హెూమ కుండాలు అష్టదిక్కుల్లోనూ వెలిశాయి. ఈఎనిమిది దిక్కుల్లో ఒక్కొదిక్కుకు మూడు కుండాలుంటాయి.

ఈ విధంగా శ్రీయాగం విశ్వశాంతి యాగంగా అన్నివిధాల నిర్వహించి మానవ కళ్యాణానికి మార్గం చూపుతున్నది.







ధర్మాన్ని కాపాడండి !

అది మిమ్మల్ని కాపాడుతుంది !!